సం॥ర చందా రు.1 0-0(పోస్టేజితోసహా)  Reg. No. M 3766

సంపుటము 32  సంచిక 6

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

సెప్టెంబరు 1943



సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు _ రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# వి ష య సూ చి క



---

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు 15 సెప్టెంబరు | సంచిక 6 |
|---|---|---|



## నిత్యసంకీర్తనము

**వివరణము :**

నీ చిత్తము నిర్మలమై హృదయము కేంద్రీకరింపబడినపుడే నీకు జ్యోతిర్దర్శన మగును. నీదృష్టి కేంద్రమును దగుల్కొనినపుడు శరీరమంతయుఁ గాంతివంతమగును. ఇది ఒక్క ఆధ్యాత్మిక సత్యమేకాదు. అనుభవనీయమైన విషయమే! ఎవనిభావము లనేకవిషయములమీద వ్రాలునో వాఁడు బలహీనుడగును. చిత్తము వికలతఁబొందును. భగవంతునితో సమాగమ మెట్లనునది యే మానవుని సత్యాన్వేషణము సంకుచిత చిత్తమున కది లభ్యముకాదు. స్వార్థచిత్తము దానినెఱుంగఁ జాలదు. పవిత్రమును నిర్మలమును, అను హృదయఫలకమునందే యది ప్రతిఫలించును.

**సంకీర్తనము:**

1. హే ఆత్మస్వరూపా! నీవు నా చెంతను నేను నీచెంతను ఉండునట్లను గ్రహింపుము.
2. నిన్నొకక్షణమైనను మఱువకుండునట్లు కనికరింపుము.
3. సదా నీ నామసంకీర్తనమే నాకు జీవనోపాధిగా నొనర్పుము.

—స్వామి రామతీర్థ

# స్వర్ణ సోపానములు

పరిశుద్ధజీవనము - ధారాళమైన మనస్సు
స్వచ్ఛమగు హృదయము - తీవ్రజిజ్ఞాస
అనాచ్ఛాదిత అధ్యాత్మికజ్ఞానము - సర్వమానవ సోదరభావము
బోధించుటకు, బోధింపబడుటకు, సంసిద్ధుఁడైయుండుట
తనకు గలిగిన అన్యాయమును ధైర్యముతో సహించుట
తన నియమముల ధైర్యముతోఁ బ్రకటింపఁగలుగుట
అన్యాయమును సాహసముతో నెదుర్కొనఁ జాలుట
మానవపరిణామము, పరిపాకమును.గూర్చి
పవిత్రశాస్త్రముబోధించిన ఆదర్శమునందు
సదాదృష్టిని నిల్పియుండుట
అను స్వర్ణసోపానములనెక్కి బ్రహ్మజ్ఞాన హర్మ్యమును ఉపాసకుఁడు చేరగలడు.

* * * *

అణువునను గుప్తమైయుండు - నంతరాత్మ
భూతకోటిని దీపించు - జ్యోతిరేఖ
ప్రాణులను నైకమొందించు - పరమకరుణ
నీదు తాదాత్మ్య మొందంగ - నెవ్వఁడోపు ?

హెచ్. పి. బ్లావిట్స్కీ.

---

# బాలాజీ

కవికిశోర & బాలకవి ఓలేటి పంచముఖేశ్వరరావు

క. కరుణా, భరణా ! ధరణీ ! భరవారణ ! కమలచరణ ! భవసంహారణా !
చిరతరగుణ ! మృదుభాషణ ! ! ద్విరదావనచణ ! ధురీణా ! వేంకటరమణా !

క. కరి రక్షింపఁగ లేదా ? ! పరిరక్షింపంగ లేదె పాంచాలసుతన్ ?
కరుణింపలేదె ధ్రువునిన్ ? ! పెఱవాఁడనె నేను నీకు ? వేంకటరమణా !

క. శ్రీకర ! కవిరాజన్య వ ! శీకర ! శ్యామలశరీర ! చిరతరకారు
ణ్యాకర ! అమృతాంధసరిపు ! భీకర ! ప్రత్యక్షదేవ ! వేంకటరమణా !

క. ఏదీనీదయ శ్రితస ! మ్మోదీ ! మంగావినోది ! భూరియశస్సం
పాదీ ! ఖగసాదీ ! అరి భేదీ ! మృదుమధురవాది ! వేంకటరమణా !

క. కలి భక్తులఁ బోచుటకై ! అల వైకుంఠంబు విడిచి ఆశేషాద్రిన్
అలమేలు మంగతో ధర ! వెలసితివి రమాకళత్ర ! వేంకటరమణా !

క. సరసిజనిభతరళాక్షా ! సురరక్షా ! దనుజశిక్ష ! సురుచిరవక్షా !
నిరతము నీశ్వరపక్షా ! విరచిత కరుణాకటాక్ష ! వేంకటరమణా !
క. కలుషగహనకీలా ! ఉజ్జ్వలశీలా ! మానిపాల ! జననుతజాలా !
పిలిచిన బలుకవ దేలా ? విలసిత కరుణాలవాల ! వేంకటరమణా !

(సశేషము)

---

# ఉపాధ్యాయులు - సంరక్షకులు

## (సంపాదకుఁడు)

వర్తమానకాలములో ప్రాథమిక విద్యాభివృద్ధికై దొరతనమువారు తీవ్రమైన కృషి సల్పుచున్నారు. తఱచు నిబంధనలను మార్చుచున్నారు. క్రొత్త నిబంధనలను ప్రవేశపెట్టుచున్నారు. ప్రాథమికోపాధ్యాయలోకము గూడ ఇందుల కనువుగాఁ దనయావచ్ఛక్తిని వినియోగించుచున్నది. శ్రమకోర్చి ప్రభుత్వమునకు బాసటగా తంటాలుపడుచున్నది. ఎవరేమి చేసినా, ఎంతకష్టపడి చెమటయూడ్చినా, విద్యాభివృద్ధి మాత్రము నానాటికి గొఱ్ఱెతోకవలె సాగుచున్నది. ఇందున్నలోప మెట్టిదో యెవరికినీ బోధపడుట లేదు. కొందఱు విద్యావిధానమే మారవలె నంటారు. మఱికొందఱు విద్యావిధాన మెట్లున్నా పల్లెజనుల యభిరుచుల కనువగునట్లు విద్యగఱపవలెనంటారు ఇంక కొందఱు విద్యాభ్యాసము నిర్బంధము చేయవలెనంటారు. వేఱొక కొందఱు ఉపాధ్యాయునకు జీతము హెచ్చించి వలసిన సౌకర్యములు, స్వేచ్ఛ, యివ్వవలె నంటారు. ఈరీతిగా ఎవరికి తోచినది వారు చెప్పుచున్నారు. అయితే వారు చెప్పినదానిలో సత్యము లేకపోలేదు. ఉన్నది. కాని పైమార్పులు మనము చెప్పగలిగినవేకాని చేయగల్గినవికావు. కాబట్టి మనకున్నవానిలోనే ఏమైనచేయగలమా? విద్యాభివృద్ధికి అసలు ఆటంకము లివేనా? మఱేమైన ఉన్నవా? విచారింతము.

సరే. పైన చెప్పినవన్నీ నిజమని యొప్పుకొన్నప్పటికిన్నీ అసలు కిటుకు దీనికి ఉపాధ్యాయులు-సంరక్షకులు. విద్యావిధానములో మార్పులు జరిగినా, ఉపాధ్యాయులకు జీతాలు హెచ్చింపబడినా, యేమిజరిగిననూ, ఉపాధ్యాయులకు-సంరక్షకులకు, పరస్పర సహాకారము, బాధ్యతలు ప్రబలకపోతే విద్యాభివృద్ధి జరుగనేరదు. ఇదియే యిప్పుడున్న ముఖ్యమైనలోపము. ఈలోపమును ఉపాధ్యాయులు పూర్తి చేయవచ్చును. ఇది వారి కందుబాటులోనున్న విషయమే. అయినను దొరతనము వారు గూడ ఇందువిషయమై కొన్ని యవకాశములను గల్పించి యున్నారు. ప్రతి గ్రామములోను సంరక్షక సంఘముల స్థాపించుట, అట్టి సంఘ సమావేశములను కనీసము నెలకొకసారి యైనను ఏర్పాటు

చేయుట, ఆ సమావేశములలో తాను ముఖ్యపాత్రగై కొని బోధకుడు విద్యార్థుల విద్యాభివృద్ధిని గూర్చి సంరక్షకులతో ముచ్చటించుట, అనునవి ప్రస్తుత విద్యా ప్రణాళికను బట్టి ఉపాధ్యాయ ధర్మము లుగా పేర్కొనబడుచున్నవి. ఈ స్వధర్మ నిర్వహణమునందు ఉపాధ్యాయలోకము కృతార్థతఁ గాంచఁగలదేని కొంతవఱకు విద్యాభివృద్ధి గలుగవచ్చునేమో ?

ఒక విద్యార్థియొక్క విద్యాభివృద్ధి కొక్క యుపాధ్యాయుడే బాధ్యుడుగాడు. అతనితల్లిదండ్రులకునుసమానమైన బాధ్యత యున్నది. కాని కొన్ని పరిస్థితులలో అనగా సంరక్షకులు విద్యావిహీనులై నప్పుడు ఈ బాధ్యత నంతను ఒక్క యుపాధ్యాయుడే వహింపవలసి వచ్చు చున్నది. సంరక్షకులు చదువులేనివారు గనుక తమకాగొడవ యేమియు తెలియ దంటారు. అట్టి సందర్భములలోను ఉపా ధ్యాయుడు "తమ పిల్లలను ప్రతిదినము సక్రమముగా బడికి పంపించునట్టి బాధ్య తను" సంరక్షకులపైఁబెట్టక తప్పదు. కాని ఈమాత్రపు బాధ్యతకుకూడ కొంతమంది తల్లిదండ్రులు తలయూపరు. "మా పని పాటలలో మేముంటాము. మాకేమియు తెలియదండీ!" అంటారు. ఇవన్నీ ఉపా ధ్యాయుడే సర్దుకపోవలెను. కాని ఒక్కొ కప్పుడు తనబిడ్డచదువు విషయమై యే బాధ్యత వహింపని సంరక్షకుడు తనకు తీరుబాటుగా నున్నప్పుడు బడికి వచ్చియో లేక పంతులు బజారులో అగపడినప్పుడో "ఏమండీ! మావాని చదువు ఎట్లున్నది? ఏమైన పైకి వస్తాడా?" అని ప్రశ్నించు తాడు. అట్టి సందర్భాలలో చప్పున సమాధానము చెప్పుటకు ఉపాధ్యాయుడా విద్యార్థియొక్క రికార్డుతో సహా తయా రుగా ఉండవలె. ఆరికార్డు అన్నివిధాలా సంపూర్తిగా ఉండవలె. దానిని చూచుకో గానే సంరక్షకుడు తనతప్పుతాను తెలిసికో వలె. తన అశ్రద్ధకు తాను నొచ్చుకోవలె. "పాపము! పంతులుగారి లోపమేమియు లేదు"రాలని గ్రహించుకోవలె. ఇట్టిరికార్డును తయారుచేసి ఉపాధ్యాయుడు ప్రతిసంర క్షకునకు చూపుచుండునేని క్రమక్రమ ముగా సంరక్షకులు తమ లోపములను గుర్తించి తమ పిల్లల విద్యాభివృద్ధిపట్ల ఉపాధ్యాయునితోఁబాటు సమానబాధ్య తను తాముగూడ వహింతురు. అప్పట్టున ఉపాధ్యాయునకు సంరక్షక సహాకారము చక్కగాలభించును. విద్యాభివృద్ధియు చక్కగా జరుగును. ఈసూత్రమును ఉపా ధ్యాయుడు తఱచు అమలు వందుంచుటకు ప్రయత్నించుచుండవలెను.

అయితే ఆతయారుచేయవలసిన రికార్డు ఎట్టిది? దాని విధానమేమి ? అని ప్రశ్నింప వచ్చును. దీనిని ఇంగ్లీషులో Progressive sheet అంటారు తెలుగులో "విద్యాభివృద్ధి పట్టిక" అని పేరు ఈపట్టికను నెలవారీగా గాని, లేక ప్రతిక్వార్టరుకుగానీ, తయారు చేయవచ్చును. ఇందులో విద్యార్థికి సంబం ధించిన సమస్తవిషయములునుఉండవలెను. ఇందుసూచింపఁబడిన నమూనాను పరి కింపుడు. ఈనమూనా ప్రకారముకొన్ని ఫారములను అచ్చువేయించికాని, వ్రాసి కాని, ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక్క ఫారము చొప్పున తయారుచేసి సంరక్షకుల కందఁజేయునేని ఉపాధ్యాయుడు తన ధర్మ మును తాను నిర్వహించిన వాడగును.

# విద్యాభివృద్ధిపట్టిక

వరుససంఖ్య   194—194 సం॥

పాఠశాలపేరు ... ... .. . . ... ... ... ... ... ... .. ... ... ... ... ...

విద్యార్థిపేరు ... ... ... . .... .. ..... . ..... ... తరగతి .. ... .. ...

| విషయము | మొదటి క్వార్టరు మార్కులు 100 కి | రెండవ క్వార్టరు మార్కులు 100 కి | మూడవ క్వార్టరు మార్కులు 100 కి | ప్రధానోపాధ్యాయుని అభిప్రాయము | |
|---|---|---|---|---|---|
| తెలుగు | | | | మొదటి క్వార్టరు | |
| లెక్కలు | | | | | |
| చరిత్ర | | | | | |
| జాగ్రఫీ | | | | | |
| సైన్సు | | | | రెండవ క్వార్టరు | |
| సివిక్సు | | | | | |
| డ్రాయింగు | | | | | |
| చేతిపని | | | | | |
| ఇంగ్లీషు | | | | | |
| బడిపెట్టిన రోజులు | | | | మూడవ క్వార్టరు | |
| హాజరైన రోజులు | | | | | |

సంరక్షకునిపేరు. శ్రీ . . .. . . . . . . .. . .. గారికి—

అయ్యా! మీబాలుని బాలికయొక్క విద్యాభివృద్ధి యెట్లున్నది తమకు తెలియుటకుగాను ఈవిద్యాభివృద్ధి పట్టికను పంపినాను. దీనిని మీరు చూచుకొని వెనుక ప్రక్కన సంతకముచేసి పంపగోరెదను.

ప్రధానోపాధ్యాయుడు.

స్వతస్సిద్ధముగా విద్యార్థి తెలివితేటలు గలవాడై చురుకుగాను, సక్రమముగాను, విద్యనభ్యసించుచుండునేని, ఇట్టివి యవసరమేయుండదు. కాని విద్యార్థులెల్లరు నిట్టి వారగుటయరుదు. అందఱు తెలివిగల్ల వారగుదురేని ఉపాధ్యాయునకు కష్టమే లేదు. సంరక్షకులడిగినప్పుడు చెప్పుటకు సందేహమునూ ఉండదు. కాని భిన్నపరిస్థితులలో యథార్థమును గప్పిపుచ్చి ముఖప్రీతి కొఱకతడు సత్యమును చెప్పజాలడు. చెప్పగలిగినను అంతరాత్మకు వ్యతిరేకముగా జెప్పవలెను. అదిసమరిజసముగాదు. విద్యాభివృద్ధికరమునుగాదు. ఉపాధ్యాయులెవ్వరును ఇట్టిపని కొడంబడరు. కాబట్టి ప్రతివిద్యార్థిని గుఱించియు నొక విద్యాభివృద్ధి పట్టికను తయారుచేయుట ఉచితము.

ఇందువలన ఉపాధ్యాయునిపట్ల సంరక్షకులకు గౌరవాభిమానములు మెండగును. వారి సహకారము చక్కగా పెంపొందును.

ప్రస్తుతము హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలో చదువు విద్యార్థులను గురించి యిట్టి పట్టికలు తయారుచేయుట చాల అవసరము కాన్పించుచున్నది. ఎందుకందురా? హయ్యరు ఎలిమెంటరీ 8 వ తరగతి పబ్లికు పరీక్షకు కూర్చున్న విద్యార్థులలో గత సంవత్సరము చాల తక్కువ మంది ఉత్తీర్ణులైరి. అది సాకుగా తీసికొని అధికారులు సంరక్షకులు, ఉపాధ్యాయులు చక్కగా బోధింపలేదనియు అసలు బోధనాపటిమయే వారికి లేదనియు, కొంతకు గొంత వ్రాకుచ్చుచున్నారు. ఇందలి నిజానిజము లెవరుచెప్పగలరు? దీనినిబట్టి ముఖ్యముగా సంరక్షకుల దృష్టిలో నుపాధ్యాయుడు శూన్యుడగుచున్నాడు. ఏమి చెప్పినావయ్యా? నువ్వు సరిగా చెప్పితే మావా డెందుకు తప్పుతాడయ్యా'' అని సంరక్షకుడు ఉపాధ్యాయుని గద్దించి యడిగిన సందర్భములును గలవు ఇదే సంరక్షకుడు తన కుమారుని సెకండరీపాఠశాలలో చేదివించుచు నొకవేళ ఆ పిల్లవాడు 2—3యేండ్లు తప్పినప్పటికి అచ్చటి యుపాధ్యాయులును ఈ రీతిగా ప్రశ్నింపలేడు ఎంతో ద్రవ్యము వ్యయమైనప్పటికి నోరు మెదల్పడు. చూచితిరా ఎంతభేదమో? ప్రాథమికోపాధ్యాయు డతని కుమారుని కొఱకెంత కష్టపడినప్పటికి నిష్ప్రయోజనమే! కాబట్టి విద్యాభివృద్ధి పట్టికలను తయారుచేసి సంరక్షకుల ముందరపెట్టుచున్నచో లోభమెవ్వరిదో వారికిచక్కగా బోధపడగలదు. తమలోభమున్న సంరక్షకులు సవరించుకోగలరు. తన్మూలమున విద్యాభివృద్ధి కొంతవృద్ధి వరకైనను ఏర్పడగలదు. ఇట్టి యాచారము ప్రతి సెకండరీ పాఠశాలలలోను ప్రస్తుతమములులో నున్నట్లు తెలియుచున్నది. అది యెట్లున్నను ప్రాథమిక పాఠశాలోపాధ్యాయు డీవిషయమున ప్రత్యేక శ్రద్ధగైకొని పరీక్షార్థముగానైన వీనినితయారుచేసి చూడవలెనని మా సలహా!

“ఇట్టి విద్యాభివృద్ధి పట్టికలు తయారుచేసినంత మాత్రమున విద్యాభివృద్ధి జరుగునా? సంరక్షకులు తమలోపములను గుర్తించి సహకారము చేయుదురా? ఉపాధ్యాయునకు మఱొక శ్రమ గల్పించుట కంటె దీని వలన వేఱు ప్రయోజనముండదు'' అని సందేహించు వారును ఉందురు. కాని అట్టి సందేహమునకు తావునివ్వక ప్రయత్నించి చూడవలెననియే మాకోరిక. ఇందువలనఁ గలుగునట్టి కొన్ని ముఖ్యప్రయోజనములీ దిగువ నుదహరింపఁబడుచున్నవి.

1 తమ బాలబాలికలు పాఠశాలకు సక్రమముగా వచ్చుచున్నది లేనిది, వారి విద్యాభివృద్ధి యెట్లున్నది, వారి వర్తనాదికము లెట్లున్నది సంరక్షకుల కెప్పటి కప్పుడు తెలియఁగలవు,

2. విద్యార్థులకు తమ విద్యాభివృద్ధి యెట్లున్నది బోధపడును. తక్కువ మార్కులు వచ్చినవారు తప్పుదుమన్న భయముతో మఱింత శ్రద్ధవహించి పట్టుదలతో చదువుదురు.

3 తక్కువమార్కులు వచ్చి విద్యాభివృద్ధి చక్కగా లేనప్పుడు సంరక్షకులు తమపిల్లల పట్ల గట్టి బాధ్యతను వహించి తగినంత శ్రద్ధతో చదివింతురు. తమలోపములను దిద్దుకొని ఉపాధ్యాయున కెల్లవిధములఁ దోడ్పడుదురు.

4. ఉపాధ్యాయుఁడు తనధర్మమును చక్కగా

నిర్వహించుచున్నట్లు ఎప్పటికప్పుడు సంరక్షకు లకు తెలియఁజేసిన వాడగును.

5 ఉపాధ్యాయులకు విద్యార్థులకు, ఉపాధ్యాయులకు సంరక్షకులకు పరస్పర సంబంధ సహకారములు చక్కగా బలపడి విద్యాభివృద్ధికి సదవకాశము లభించును.

ఇట్టివి మఱికొన్ని యుండిన నుండ వచ్చును. మేమిందు సూచించిన "విద్యార్థి పట్టిక" నమూనాలో ఇంకను, ఇతర విషయము లెవ్వియైన చేర్చవలెనని తమకు తోచినచో ఉపాధ్యాయులు మాకు తెలియఁజేయవలసినదని మనవి.

---

# 4, 5 తరగతుల నివృత్తి

**' జి. కె. చౌదరి**

భారతీయుల నిరక్షరాస్యత క్షీణించి ప్రాథమిక విద్య తగినంతగా అభివృద్ధి చెందాలనే వుద్దేశ్య ముతో ప్రభుత్వమువారు ప్రాథమిక విద్యకు చతుర్విధ నిబంధనల (Tests) ను ఏర్పాటు చేసారు. అవి 1. ప్రతిపాఠశాలలోను 5 తరగతులు పూర్తిగా వుండాలి. 2. గ్రామంలో బడికి రాదగిన వయస్సు బాలికలలో 25% బడిలో విద్య నభ్యసిస్తువుండాలి. 3. ఏతరగతిలోను విద్యార్థులు ఇద్దరు, ముగ్గురుగా కాకుండా ఎక్కువమంది విద్యార్థులు వుండాలి. 4. ఒకటో తరగతిలో వున్న విద్యార్థులకు 4, 5 తరగతులలో విడివిడిగా నాలుగోవంతు విద్యార్థులు వుండాలి.

ప్రస్తుతము నాలుగో నిబంధనను శాఖా చంక్ర మణముగా పరామర్శచేసి చూద్దాము.

మనదేశము పూర్తిగా వ్యావసాయకదేశము. ప్రజలు అంతగా విద్యావిషయిక సంస్కారమును పొందినవారు కారు. నూటికి నూరు విద్యావంతులతో విలసిల్లుచూ కొన్ని దేశాలున్న ఈ యిరవయ్యో శతాబ్దములోనే భారత దేశములో నూటికి 12 కన్నా ఎక్కువ విద్యావంతులు లేరు. విద్యావిష యికంగానే కాక వ్యవసాయము కూడ అనాది సిద్ధమైన పూర్వీక పద్ధతులను వదలి ఆధునికమైన సంస్కార పద్ధతులతో కూడినది కాకపోవడాన, తగినంత వరుమానం రాక ప్రపంచములోని బీద దేశాలలో కెల్ల అగ్రస్థానము సంపాదించిన ఈదేశ ప్రజలు దాన దానతోడవుతుందనే వుద్దేశ్యముతో కూడి కలిసి వచ్చినా చాలనే సంబరముతో కొత్త ఈడువచ్చిన తమ బిడ్డలను చదువులు మానిపించి పశువుల కాపర్లుగానైనా నియమించుతారు. కేవలము శ్రమ శక్తిమీదనే ఆధారపడి యుండు కార్మిక బాలురుకూడ కొత్త ఈడు వచ్చిందంటే ఏదోపనిలో ప్రవేశించిననేగాని పొట్టగడవదు. పట్టణ ప్రాంతపు కర్మాగారాలలో ఎందరో చదువు కునే ఈడువున్న బాలురు కనబడుతున్నారు. ఏవిధముగానైనా కొత్త పని చేసే ఊహాపోహాలు కలిగినవంటే కుటుంబ సంరక్షణ భారము కొంత ఆ కుర్రవానిమీద పడిందన్నమాటే.

ఇట్టి వారికి ఏవిధమైన ఆర్థికసాయము చెయ్యకుండా ఎక్కువమంది ప్రాథమిక పాఠశాల చదువు పూర్తి అయ్యేవరకు విద్యాభ్యాసము చెయ్యాలి అనడము ఎంత హాస్యాస్పదముగా వున్నదో తెలుస్తూనే వుంది.

ప్రాథమిక పాఠశాలకు విద్యకై వచ్చు విద్యార్థు లలో నూటికి ముగ్గురో, నలుగురో తగు భాగ్య వంతులమాట. మనకు రాజభాషగానే కాక అంతర్జాతీయముగా కూడ ప్రముఖస్థానము నలంకరించినది ఆంగ్ల భాష. ఆంగ్లభాషను మినహాయిస్తే ఉన్నతవిద్యాశాలలో మరి ప్రవే శానికే అర్హతయుండదు. ఉన్నత విద్యాశాలలో ప్రాథమిక తరగతులనుండి ఆంగ్లభాషకు మాతృ భాషా తుల్యమైన స్థానమునిచ్చి పోషించుచున్నారు.

ప్రాథమిక పాఠశాలలలో ప్రతి వుపాధ్యాయు నకు 20 విద్యార్థుల చొప్పునసగము హాజరుండి నలురుగు టీచర్లున్న పాఠశాలలో సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుడు ప్రధానోపాధ్యాయుడుగా నియ మింపబడుతాడు. అట్టివారే ప్రాథమిక పాఠశాల లలో ఆంగ్లభాషా బోధనకు అర్హులు ఇతర విష యాలలో (Subjects) విద్యార్థులు ఎంత సమర్థు

లైనా ఆంగ్లభాషశూన్యము ఐన మరి సెకండరీ పాఠశాలలలో ప్రవేశార్హతయే సున్న. ప్రాథమిక పాఠశాలలలో పూర్తి అవకాశము వుండి, ఆంగ్లభాషా బోధనకె అర్హుడైన ఉపాధ్యాయుని సంపాదించాలి అంటే నూటికె నాలుగైకు గ్రామాలకేమైనా ఆపాటి అవకాశము వుంటుందేమో.

ఈ ప్రకారము చూస్తే ప్రాథమిక పాఠశాలలో అయిదో తరగతి పూర్తిఅయ్యే అవకాశము బహు తక్కువ మందికి గాని లభించదు. ఒకవేళ లభించి ప్రాథమిక పాఠశాలలో అయిదో తరగతి పూర్తిచేసి ఉన్న విద్యాభిలాషియై ఉన్నతపాఠశాలలకేగినపుడు ఆరో తరగతి (Form 1) కి బదులు తిరగ నాలుగో తరగతిలో ప్రవేశించవలసి వస్తుంది. అంటే అమూల్యమైన రెండు సంవత్సరాల కాలము ఒక్క ఆంగ్లభాష కొరకు వ్యర్థపుచ్చవలసి వస్తుంది కనుక ఆ నష్టాన్ని పూరించుకోవడానికె రెండు మార్గాలున్నాయి, ప్రాథమిక పాఠశాలలో మూడో తరగతి పూర్తికాగానే ఉన్నత పాఠశాలలలో నాలుగో తరగతిలో చేరి చదువును సాగించడము ఒకటి. ప్రయివేటుగా చదువుకునే వీల్లుంటే మూడో తరగతి నుండి ప్రాథమిక పాఠశాలకు స్వస్తిచెప్పి ఆంగ్లభాషాయోగ్యతను సంపాదించి క్రమంగా ఉన్నత విద్యాభ్యాసానికి ప్రయత్నము చెయ్యడము. ఇంతే పద్ధతి అవలంబించి నా ప్రాథమిక పాఠశాలకు దెబ్బ అనగా తగినంతమంది విద్యార్థులు ప్రాథమిక పాఠశాలలో ఉండరన్నమాట.

ప్రభుత్వమేమో ఫలానవిధముగా వుంటేనే సరి అటుఫర్మానాలను జారీచేస్తూంది. వాస్తవిక పరిస్థితులేమో అందుకు భిన్నముగావుండి "ముందు నుయ్యి వెనుకగొయ్యి" గా వుంది. ప్రాథమికోపాధ్యాయుని స్థితి. యథార్థమైన ప్రజల వాస్తవిక పరిస్థితులను పరిశీలించకుండా 'చట్టము' లను కట్టుదిట్టముచేసినంతమాత్రాన భారతగ్రామీణ అక్షరాస్యతవృద్ధి అవుతుంది అనుకోవడము నేలవిడిచిసాము చెయ్యడము వంటిది. పోనీ ప్రాథమికోపాధ్యాయుడు జీతము గ్రాంటు డబ్బుల కాశించి ఏ విశ్వామిత్ర సృష్టి ఐనా గావించి, ఇంతమందిని కూర్చోబెట్టి చదువు సంధ్యలు నేర్పుతాడు. అంటే మంత్రాలకు చింతకాయలు రాలేకాలము' కాదాయె?

చట్టాలను ఇనుపచట్రాలలో బిగించినా, కొయ్యచట్రాలలో బిగించినా, ఫలితము మాత్రము.సున్నకు సున్న హళ్ళికి హళ్ళి. మరొకందుకు ఉపయోగపడవచ్చు! చట్టము యొక్క కట్టుదిట్టాలను చూపి ప్రజలను 'ఆహా! ప్రభుత్వము అనేట్టు చేయవచ్చు. పంతుల్లు ఉద్యోగాలకు, గ్రాంటుడబ్బులకు ఆశించి ఆ పేర్లు ఈ పేర్లువ్రాసి చూపెడుతున్న ఫలితము గామరిన్ని అంకెలుచేరి నిండైన అంకెకనబడునేమో గాని వాస్తవిక విద్యాభివృద్ధి మాత్రము 'యథా ప్రకారస్థిదిరస్తు'.

కనుక ఇన్ని సాధకబాధకాలతో కూడుకొన్న ఈ విషయాన్ని ప్రభుత్వము గమనించకుండ ఈ నిబంధనను చేయడము న్యాయము కాదు. చేయవలసిన ప్రయత్నము ఏమీచేయకుండా చట్టాలు చేసినంత మాత్రాన ఫలితములో మార్పు మాత్రము ఏమీ వుండదు.

---

# బిడ్డల జడత్వమును బోగొట్టి, వారి సహజమైన చుఱుకుదనమును వృద్ధిపఱచు ఉపాయములు

(టి. గోపాలకృష్ణయ్య - టీచర్ మునిసిపల్ ఫస్ట్‌గ్రేడ్ - హిందుబాయస్‌స్కూలు - హిందూపురం)

ఆటపాటలలో మఱియు ఇతర కార్యములలో చాలినంత చుఱుకుదనమును జూపకుండు బిడ్డలను సోమరులని నిందించిక్కొన్ని సమయములలో శిక్షించుట సరిగాదు! బిడ్డల సోమరితనము ఉద్దేశపూర్వకమైనదేనా? లేక దీనికి సహజమగు కారణములున్నవా? దానిని పరిహరించు మార్గమేదీ? అను అంశములను పోషకులూ, ఉపాధ్యాయులూ, తెలియవలసినదావశ్యకముగానుందురు. ఆరోగ్యముగానుండు బాలురు చుఱుకుగానుండుట స్వాభావికముగానుండును. అట్లు లేక సోమరిగానుండిన దానికేదియో యొక కారణముండునని తెలియవలెను. ఈకారణము "దైహిక"ముగా (అనగా దేహమునకు సంబంధించినదిగా) నుండును. లేక "మానసిక" ముగానైన వుండును. దైహికము కారణమైన పక్షమున, బాలుని

వెంటనే వైద్యులకు చూపించి, తగు చికిత్సచేయించవలెను. చెవి, చక్కగా వినబడనపుడు బాలుడు సోమరిగానుండును. ఆబాలుని గుఱించి నిర్దేశించి చెప్పినమాటలు గోచరమగుచున్నవి. తరగతిలో బాలురందఱికిని అన్వయించునట్లు వివరించునట్టి అంశములు ఆబాలునికి తెలియనే తెలియవు. ఇందువలన బాలురు మఱేదోయొక విషయమును యోచించుచు కాలము గడుపుచుందురు. కంఠమువైపు అడినాయిడ్ యను దుర్మాంసము పెరిగిన పక్షమున ఆపరేషన్ అవసరమై యుండును. కొందఱు బాలురకు నేత్రపటుత్వము చాలక, సోమరి తనము వచ్చును. దృష్టితగ్గిననూ ఉపాధ్యాయులు దండింతురేమోయను భయముచేత దృష్టి పటుత్వముండు బాలురవలెనే, వీరునూ చదువుటకు యత్నించి, కన్నులకు మితిమీరిన శ్రమనిచ్చి, కొద్దికాలములోనే నేత్రపాటవమును చికిత్సకు సాధ్యము కానంతవఱకు బోగొట్టికొందురు. చాలినంత నిద్రరాకుండిన లేక అజీర్ణముచేత సోమరి తనముకల్గుట సహజమే. ఇట్టి సందర్భమున పనిచేయవలెనని బాలుని నిర్బంధించుటచేత చెఱుపేగాని ప్రయోజనముండదు.

పండ్లు శుభ్రముగా లేకుండిన, లేక వంకరగా నుండిన అనేక వ్యాధులకు కారణమగును. దీనిఫలముగా సోమరితనము వచ్చును. తియ్యని పదార్థములను విశేషముగా తినుటచేత కడుపులో పురుగులు చేరుచున్నవి. శుభ్రమైన గుడ్డలను దేహమును కప్పునట్లు వేసికొనక వుండుట, పసితనమునందు మాటిమాటికి రోగగ్రస్తులగుట, ఈమొదలగు అనేక కారణములు సోమరితనమును కలుగజేయుచున్నవి రోగచిహ్నమగపడినపుడే వైద్యులకు చూపించి, చికిత్స చేయించుటచేత బాలుర సోమరి తనమును చాలవఱకు పరిహరించవచ్చును. ఇందుకొఱకే గొప్పపట్టణములలో నుండు బళ్లలో బాలికా బాలకుల వైద్యపరీక్షకై ప్రభుత్వపు ఏర్పాటులున్నవి. గ్రామాంతరములలోనూ, ఈవిధమగు వైద్యపరీక్ష సంవత్సరమునకొక తూరియైననూ, క్రమముగా జఱుగునట్లు ఏర్పాటు చేయుట ఆవశ్యకముగానుండును. అయితే డాక్టరు బడిబాలురను పరీక్షించి, ఈవిధమగు రోగమున్నదని తెలిసి కొన్నంత మాత్రమున చాలదు. వైద్యుల వ్రాతను అర్థముచేసికొని, తగుచికిత్సకు ఏర్పాటు చేయునంతటి తెలివితేటలు, విరామము, ద్రవ్యానుకూలము, ఎక్కువమంది పోషకులకుండదు. అందుచేత వైద్యపరీక్షకు అంగముగా మఱియు ఫలరూపముగా వైద్య చికిత్స నేర్పాటుచేయుట ఆవశ్యకమై యుండును. ఈవిధముగా వైద్యపరీక్షకు గ్రామాంతర పాఠశాలలలో క్రమమైన ఏర్పాటు కలుగు వఱకు పోషకులు తమ బాలురను అప్పుడప్పుడు వైద్యులకు చూపి, వారి ఇంద్రియశక్తి పట్టువుగా నుండునట్లు, దేహారోగ్యము చక్కగా నుండునట్లు, గమనించుచూ వచ్చిన నిరాతంకమగు విద్యాభివృద్ధికి సహాయముగా నుండును.

ఇంతవఱకు బాలుర దైహిక విలక్షణములచేత ప్రాలుమాలిక కలుగు విచారమును ప్రస్తావించినట్లయినది. సోమరితనమునకు మూలకారణమగు మానసిక లక్షణము లేవియనుటను యోచింతము — బాలుర మెదడుకు ఏవిషయమునైనను, ఏరీతిలోనైనను, నింపవచ్చును. ఇట్లునింపుకొనుటకు బాలుడు సమ్మతించని పక్షమున దేహదండనమే చికిత్సయను భావన బహుకాలమువఱకు పోషకులకు, ఉపాధ్యాయులకు, వుండెను ఇప్పటికిని అర్థములేక నే-వర్ణమాలా క్రమములో అక్షరములను దిద్దించుచు, అనేక సంవత్సరములైననూ బాలురు ప్రాథమిక ఒకటవ తరగతిలోనే కూర్చుండి యుండుట మాదృష్టికి గోచరముగా నుండుట ఇదివఱకే చెప్పిన మాభావనకు నిదర్శనముగానుండును. ఇటీవల మనశ్శాస్త్రమును(సైకాలజీ) శోధించిన కొలది ఈభావము శుద్ధముగా నబద్ధమని వ్యక్తమగుచున్నది బాలుర సామాన్యధర్మమునకు తోడుగా ఆయాబాలునికి మాత్రము అన్వయించు విశేషలక్షణములుండుననియూ, వీటిని కనిబెట్టి వానికనుకూలముగా బోధించిన పక్షమున విషయములు, బాలుర మనస్సుకు పట్టువడుననియూ, కనిపెట్టబడినది. మనశ్శక్తితో కవలపిల్లలుకూడా ఒకటేరీతిలో నుండవు. విషయములను గ్రహించునట్టి, విమర్శించునట్టి, మఱియు నితరులకు తెలియజేయుశక్తి, ఆయా బాలునికి ప్రత్యేకముగా నుండుననుటను, అనేక ప్రయోగములచేత శాస్త్రజ్ఞులు నిర్ధారించియున్నారు. ఒకబాలుని, "సోమరి, మొద్దు, పనికిమాలినవాడు" అని నిర్ధారించుటకు పూర్వము వాని లక్షణమును, మనము తప్పులేక తెలిసికొని యున్నామా? మఱియు వాని స్వభావమునకు అనుగుణముగా బోధించుచున్నామా? యని ఆలోచించవలెను. నిర్జీవమగు కట్టెలో పనిచేయు వడ్రంగి, కట్టెయొక్క లక్షణమును దెలిసి దానికి దగిన ఆయుధములను బొందుపఱచుకొని పీచు పోయివుండు రీతిలో తోపడా పట్టి మెలకువగా పనిచేయునపుడు, అతి సూక్ష్మమగు

బుద్ధిశక్తిని బొంది, ముందు లోకోపకారము చేయవలసిన బాలుర లక్షణమును తెలియక మాదర్జానుండి వారి యోగ్యతను నిర్ణయించుట ఉచితముగాదు. బాలురకు తెలువు విషయము నిస్సారముగానుండిన లేక వారి గ్రహణశక్తికి మీరి యుండిన అనాదరము కలిగి, సోమరితనము కలుగుట స్వాభావికముగా నుండును. బాలుర దైహిక-మానసిక శక్తులను పరీక్షించి, లోపము అగపడిన వెంటనే తగు పరిహారము సేర్పఱచిన పక్షమున సోమరితనమును ఇంటిలోనూ, పాఠశాలయందునూ, ఆటమైదానమందునూ, చూపక బాలురు తమ సహజమగు చుఱుకుదనమును, తమయొక్కయుం, ఇతరుల యొక్కయు, మేలుకొఱకు సహకారమగు కృత్యముల వైపునకు మరల్చినట్లు చేయవచ్చును.

పాఠశాలలలో విద్యనేర్పుటే ముఖ్యముగాదు. విద్యకంటె మొదట సత్ప్రవర్తనమును నేర్చుకోవలెను. నేర్చిన విద్యకు నడత భూషణము. ఒక స్త్రీ ఎంత గుణాఢ్యురాలైననూ, సౌందర్యవతియైననూ, భర్తలేని పక్షమున ఎట్లు శోభింపదో ఆట్లే మంచి నడతలేని విద్యావంతుడు శోభింపడు. మంచినడత లేనివాడు పండితుడే అయినను వానికి పూజ్యత వుండదు. కనుక విద్యార్థులు మంచినడతను నేర్చుకొను విషయమ్మందు విద్యకంటె ఎక్కువగా గమనముంచవలెను.

విద్యాతురుడగు వానికి భయమూ, లజ్జయూ, సుఖమూ, అతినిద్రయూ, వుండరాదు. విద్యాభ్యాసమునకు వేకువజామే తగినది. పగలంతయూ, పని చేసి, రాత్రిపూట పండుకొనుటచేత ఆయాసమంతయు పరిహారమై మనోనైర్మల్యము కలిగి యుండును. ఇతరమగు పనులు చేయుటకు వేకువ జాము అకాలముగా నుండును. అప్పుడు విద్యాభ్యాసము చేసిన పక్షమున విద్య చక్కగా పట్టుబడును. మరియొకటి మనస్సుకు తాకి ప్రొద్దెక్కిన కొలది మనోనైర్మల్యము క్రమముగా తగ్గుచునే యుండును. కనుక ప్రాతఃకాలము పాఠమునకు అనుకూలము. ఇందుకొఱకే ఇప్పటి విద్యాభ్యాస క్రమమందు ఎక్కువ బుద్ధి శక్తిని అపేక్షించు పాఠములను ప్రాతఃకాలమందు బాలురు బడికి వచ్చిన వెంటనో జఱుపుదురు.

విద్యావిహీనుడు పశుసమానుడు — ఆహారనిద్రాభయాదులు పశువునకు, మనుష్యునికి, సమానములు. పశువుకంటె మానవునికి జ్ఞానమొకటి మాత్రమెక్కువగా నుండును. ఇట్టి జ్ఞానార్జనమునకు విద్యయే మూలాధారము. ఇట్టి విద్య మానవుని సుఖమునకు సాధకమైనది విద్యయే మానవుని సుందరమైన రూపము. ఆర్జితధనము. విద్యావంతుడు మంచి కీర్తిని బొందును. వానికి రాజపూజ్యతయు కలదు. విద్యావంతునికి పరదేశము స్వదేశమువలెనే వుండును.

బాల్యమందు విద్యఅలవడనట్లు తక్కినకాలములందు అలవడదు, ఒకచెట్టులేతగా నున్నప్పుడు వంగునుగాని ముదిరిన మాను వంగదుగదా! అయితే బాల్యమందు నేర్చినవిద్యయే చాలుననియూ వయస్సుమీఱిన తర్వాత విద్యరాదనియు తలపులు కారాదు. బాల్యమందు చేతనైనంత విద్యాభ్యాసము చేయుటయేగాక ఆ పిమ్మటనూ విద్యార్జనమందే మనుస్సును వుంచి ఉండవలెను. "క్షణశః క్షణశశ్చైవ విద్యామర్థంచ చింతయేత్" అన్నట్లు ప్రతిక్షణమందునూ విద్యనూ, అర్థమునూ సంపాదించవలయును. దేవతాధ్యానము చేయుటకు ఏకాంగియై యుండవలెను. విద్యావ్యాసంగమునకు సహపాఠులుండవలయును. లోకమందు సర్వజ్ఞులొక్కరునూ లేరు. ఒకనికి తెలియని విషయము మరియొకనికి తెలిసియుండవచ్చును. సహపాఠులుండుట వలన అన్ని విషయములూ ఒకచోటనే తెలియుచున్నవి.

అనుష్ఠానము — నేర్చినదానిని అనుష్ఠానమందుంచవలెను. ఈయలవాటు వారిలో చాలా తక్కువ. నోటితో నేర్చినదానిని చేతితో చూపుట ముఖ్యము. అందుచేత ఆయా అంశములయందు నిర్దుష్టమగు జ్ఞానము కలుగుటయే గాక లోకానుభవము ఎక్కువగును. నేర్చిన దానిని చేతిలో చూపుట పాశ్చాత్యులలో విశేషముగా నుండును. వీరి సుగుణమును మనము ముఖ్యముగా అనుసరించవలెను.

ఆదర్శాచరణము —"అవశ్యం పితురాచారం" అన్నట్లు మన పూర్వీకుల ఆచార వ్యవహారములను అనుసరించవలసినది మనకు పరమావశ్యమైనది. వారికి అభిమతము కాని వాటిని మనమాచరించుట పాడిగాదు. వారి కభిమతమైన వాటిని కాలదేశానుగుణముగా అభివృద్ధి పఱచుకోవలెను.

సత్సహవాసము —దుస్సంగముచేత దుష్ఫలములే విశేషముగా కలుగుచుండును. సత్సంగముచేత కలుగు సుగుణములను ఇంతింతయని చెప్పసాధ్యము గాదు. పువ్వులచేత నార స్వర్గమునుచేరునట్లు మనము సత్పురుషులతో చేరుటచేత మనయొక్క దుర్గుణములన్నియు దూరములై వారివలె లోకమాన్యులగుటలో సందేహము లేదు.

విమర్శ —(తనతప్పును తానే దిద్దుకొనుట.)

ఇది ఎక్కువగా అనుసరింపబడవలసిన సుగుణము. విద్యార్థి సింహమువలె వుండవలెను. అనగా భయంకరుడుగానుండవలెనని అర్థముగాదు సింహము తాను వచ్చిన దారినే ఎట్లు మరల మరల చూచుచుండునో అట్లే విద్యార్థులూ తాము చేయునట్టి లేక చేసినపని సాధువా? అసాధువా? సంగతమా? అసంగతమా? అని విచారము చేయుచుండవలెను. ఇందుచేత తమ నీడను తామే వెఱచునట్లు-పాపభీతి భూతదయా పశ్చాత్తాపములు కలుగును. ఇట్టివారు ఇతరుల నిర్బంధము లేకపోయిననూ తమంతట తామే వెఱచి, పాపకృత్యములను చేయజాలరు. అంతరంగమందు చేసిన పాపము అంతరాత్మునికి గోచరముగాక మానదు..

గ్రంథావలోకనము —మనుష్యునికి ఇహ పర సౌఖ్యములు రెండునూ కావలెను. ఇహలోక వ్యవహారమును తెలిసి ఆమూలకముగా సుఖించుటకు ప్రకృతమే వార్తాపత్రికలు చాలా సహాయభూతములుగా నున్నవి. అయితే ఇట్టి పత్రికలచేత అపారమగు లౌకిక వ్యవహారములను తెలియుటకు వీలు లేదు. వీనిని తెలియుటకు మనకు సద్గ్రంథములు అత్యంత సహాయకరములై యున్నవి. విద్యార్థిదశయందే పుస్తకభాండాగారముల నేర్పరచి గ్రంథావలోకనమందు మనస్సును స్థాపించిన పక్షమున పరిణామమందు పూర్ణఫలము కలుగును.

ఇతర సుగుణములు — ఇంతవరకు చెప్పిన విషయములేగాక విధేయత సత్యము, ప్రీతి, స్నేహము, పరోపకారము, భక్తి, ధైర్యము, శరణాగత పరిపాలనము అస్వార్థపరత్వము, అహింస, ఆదరము, ఔదార్యము, కనికరము,మున్నగుసుగుణములచేత గణనీయులగువిద్యార్థులచేతవారు విద్యాభ్యాసముచేయుచుండు పాఠశాలకును, ఆదేశమునకునూ, ఆజనాంగమునకునూ, చాలా ఉపకారము కలుగుటయే గాక పురుషుడు భూమిమీద జన్మమెత్తినందుకు ముఖ్యముగా సాధించవలసిన పురుషార్థసాధనము గూడ వీరికి సంపూర్ణమగును. ఇట్టిపూర్ణఫలములన్నియూ ఒక్కొక్క విద్యార్థికి విద్యార్థియొక్క ప్రయత్నము చేతనే సులభముగా లభింపజాలవు.

"సంఘేశక్తిః కలౌయుగే" అన్నట్లు "ఒకనికంటె ఇద్దరు మేలు" అను పూర్వీకుల వుక్తులవలె వివిధములగు పనివాండ్రందరూ వేర్వేరు సంఘములను కల్పించుకొనియున్నారు. ఇట్లనే అన్నిచోట్లయందుయూ, విద్యార్థులకు అదోకసంఘముండవలసినది. అత్యంత ముఖ్యమైనది.

కనుక ఉపాధ్యాయ సంఘములు — కేవలము విద్యాభ్యాసక్రమములను సంఘములై యున్నవి గాన, ఇట్టి సంఘముల కార్యక్రమములలో కావలసినమార్పులు, బాలుర విద్యాభ్యాసమందు పోషకులు, మరియు బోధకులు గమనించవలసిన అంశములు, ప్రాథమిక విద్యాభ్యాస స్థితి, ప్రాథమిక విద్యాభ్యాసమందు కలుగుచుండు వ్యర్థవ్యయముయొక్క నివారణోపాయములకు సంబంధించిన సూచనలు, ఇండియా దేశమునకు ఆవశ్యకమైన దేశీయ శిక్షణము, మాతృభాషా బోధనము, విద్యాభ్యాస క్రమము, ప్రశ్నలెక్కల ఉద్దేశము, మరియు విధానము, ప్రాథమిక పాఠశాలలో చదువుటను, వ్రాయుటకు, నేర్పుట, లెక్కలలో తలదిమ్ము బోధనలో నవీనమార్గములు, విజ్ఞానశాస్త్రబోధనలో నవీనదృష్టి, భరతఖండమందు ఒక నవీన విద్యావిధాన పాఠశాలకుండ వలసిన లక్షణములు బిడ్డలు వారి శిక్షణ సమస్యలు, బిడ్డల గుణములు, బాలుర ప్రాబల్యము, నర్సరి పాఠశాలలు, ధార్మిక శిక్షణము యొక్క ఆవశ్యకత, ప్రాథమిక పాఠశాలలలో ఆది ఆంధ్ర బాలబాలికలను ప్రత్యేకముగా తరపీతు చేయు విధానము, సాంఘిక దృష్టి, మరియు ఉపాధ్యాయుని కర్తవ్యము ప్రాథమిక విద్యాభ్యాసమందు తల్లుల సహకారము, విద్యాభ్యాసమందు సినిమాయొక్క ఉపయోగములు, ప్రాజెక్ట్ మెథడ్ యొక్క మూలాధారము, మరియు నిజమైన విద్యాభ్యాసము, పరీక్షలలో బాలురు వ్రాసిన ఉత్తర పత్రికలను చూచుటలో కలుగు దోషములు, ఉత్తమ శిక్షకుల కుండవలసిన లక్షణములు, ఒక తరగతిలో బాలురు దీర్ఘకాలము నిలిచిపోవుటను గురించిన విమర్శ, పరీక్షలకు ప్రశ్నల నేర్పఱచు నవీన మార్గము, స్వప్రయత్నముచేత భూగోళపాఠమును నేర్పుట, భూగోళపాఠమునందు మానుపోపయుక్త విషయములు, మున్నగు అత్యవసరవిషయములను సంఘములలో విమర్శించు పక్షమున సంఘమువల్ల ఉపాధ్యాయులకు వాస్తవమైన లాభములు కలుగునని అభిప్రాయపడవలసి యుండును. ఇందుకుగాను ముఖ్యముగా పాఠశాలా ప్రధానోపాధ్యాయులు, సహోపాధ్యాయులతో కార్యకారణ విమర్శనలో కుతూహలులై మెలగి ధన్యత్వము గాంచవలెనని యుండును.

# భూగోళ ప్రశ్నోత్తరములు

(ఆగష్టు సంచిక తరువాయి)

వేదాన్తము శ్రీనివాసాచార్యులు హెడ్ మాష్టరు ఆత్కూరు.

(సైబీరియా - ఆసియాఖండ నిమ్నోన్నతము - శీతోష్ణస్థితి, వర్షపాతము - స్వాభావికమండలములు రాకపోకలవసతులు, ఐరోపాఖండము - ఎల్లలు - నదులు శీతోష్ణస్థితి.)

**37.** స్మర్నా - బాకూ, దేనికి ప్రసిద్ధి ?

జ స్మర్నా, పొగాకునకు బాకూ నూనె బావులకు ప్రసిద్ధి.

**38.** ఈ క్రింద యివ్వబడిన దేశముల ముఖ్య పట్టణములు, ముఖ్యవృత్తులెవ్వి ?

జ ఆసియామైనరు అంగోరా, పశుపాలన, తివాచీనేత.

సిరియా డెమాస్కస్, వ్యవసాయము.

పాలెస్టీను జరూసెలం. వ్యవసాయము

ఇరాక్ (మెసపొటోమియా) బాగ్దాదు - వ్యవసాయము.

పర్షియా టెహరన్. కంబళ్లనేత.

**39.** ఆఫ్గనిస్తాన్ ముఖ్యపంటలు, రాజధానిని పేర్కొనుడు?

జ గోధుమలు, పండ్లతోటలు, పట్టువస్త్రముల నేత, గొఱ్ఱెల పెంపకము. రాజధాని కాబూలు.

**40.** సైబీరియా అతిశీతలదేశము. కారణములెవ్వి?

జ అతిశీతలమండలములోనిది. ఉత్తరధ్రువము వరకు వ్యాపించియున్నది. మంచు కురియు చుండును.

**41.** సైబీరియా సహజభాగములను ప్రజలవృత్తులను పేర్కొనుడు?

జ టండ్రాస్ జంతువులను పట్టుట (2) సరగుడు అరణ్యములు వేటాడుట, ఉన్ని చర్మముల వ్యాపారము. (3) స్టెప్పీస్-పశుపాలన ముఖ్యవృత్తి.

**42.** సైబీరియా యందలి నదులు, రైలుమార్గముల పేరేమి ?

జ ఓబై - యన్సి - లీనా. ట్రాన్స్‌సైబీరియన్ రైలుమార్గము.

**43.** సైబీరియాలో నదులుపయోగపడవు కారణము లెవ్వి ?

జ 1. శీతల ప్రదేశమునదులు. 2. ఉత్తరముగ ప్రవహించి ఆర్క్‌టిక్ మహాసముద్రములో కలియును.

**44.** ఆసియాఖండమునకు దక్షిణమున గల ద్వీపకల్పము లెవ్వి ?

జ 1. అరేబియా 2. ఇండియా 3. ఇండోచైనా.

**45.** ఆసియాకు ఆగ్నేయ భాగమందు వర్షము హెచ్చు. కారణము లెవ్వి ?

జ ఉష్ణమండలములోగలదు. 2. సముద్రముచే చుట్టబడియున్నది. 3.ఋతుపవనప్రదేశము.

**46.** యూరప్‌ఖండమును ద్వీపకల్పములతో కూడిన ఖండము - కారణము లెవ్వి ?

జ ఈ ఖండము మూడు వైపుల నీటిచే చుట్టబడియుండుట (2) తీరరేఖ చీలి పలుతావులందు సముద్రములోనికి చొచ్చుకొని పోవుట (3) డెన్మార్కు, స్పెయిన్, పోర్చుగల్, ఇటలీ మొదలగు దేశములు ద్వీపకల్పములగుట.

**47.** యూరప్‌ఖండము విదేశ వ్యాపారమునకు అనుకూలము. కారణము లెవ్వి ?

జ ఐరోపాఖండము భూమండలమునకు మధ్య గలదు 2. తీరరేఖ చీలియుండుటచే పెక్కు నౌకాశయములు గలవు 3 శీతోష్ణస్థితి 4 సముద్ర ప్రభావమువలన శీతలబాధ తగ్గుట.

**48.** యూరప్‌ఖండమందలి గొప్ప పర్వతమెద్ది ! దానిశాఖలెవ్వి ?

జ ఆల్ప్సు పర్వతము. తూర్పుశాఖ బాల్కన్-కార్పేతియన్ పర్వతములు. దక్షిణశాఖ అపినైన్ పర్వతములు సిరనీస్ పర్వతములు.

**49.** యూరప్‌ఖండమందు - మధ్యధరా, కాస్పియన్, నల్లసముద్రములలో పడు నదులెవ్వి ?

జ రోన్ - పో - డాన్యూబు, నల్లసముద్రమందు

వాల్గా కాస్పియన్ సముద్రమందుపడును.

50. రైన్ - రోన్ - డాన్యూబు, నదులనుగూర్చి వ్రాయుడు ?

జ రైన్-స్విట్జర్లాండు దేశములోనిఆల్ప్సు పర్వతములలోపుట్టినది. జర్మని స్విట్జర్లాండులకు మధ్య సరిహద్దుగ నేర్పడి జర్మని గుండా ప్రవహించును. ఉపనదియూర్. హాలెండు దేశమందు చీలిరాటర్ డామ్ వద్ద ఉత్తరసముద్రములో కలియును.

రోన్ —ఫ్రాన్సునకు దక్షిణతీరమున ఆల్ప్సు పర్వతములలోపుట్టి జినివాసరస్సులో పడును. నదీముఖద్వారమున మార్సెయిల్సు అను రేవుపట్టము కలదు. తుదకు మధ్యధరా సముద్రములో కలియును.

డాన్యూబ్—ఇది జర్మని దేశములో బ్లాక్ ఫారెస్టునందు పుట్టినది. అంతర్జాతీయనది ఇన్ దీని ఉపనది. దీనికి మార్చి మరియు ద్రావా-సావా-టీసా-అను నదులు హంగేరీ మైదానమునందు కలియును. ఇది నల్లసముద్రమందు పడును.

51. వాల్గానది గొప్పది కాని నావికాయానము నకుతగదు. కారణములు ?

జ ఐరోపాలో గొప్పనది. దీని పరీవాహిక ప్రదేశము విశాలమైన పల్లపు బయలు (2) నదీవేగము మిక్కిలి తక్కువ (3) అన్నికాలములందు నీరుండదు.

(సశేషము)

---

# ఆఫ్రికాఖండము - ముఖ్యవిషయములు

## (8 తరగతి విద్యార్థులకు)

వేదుల నరసింహము

బార్బరీ రాజ్యములు —ఆఫ్రికా ఖండమున నుత్తర భాగమున మొరాకో, అల్జీరియా, ట్యూనిస్, ట్రిపోలీరాజ్యములుగలవు. ఇందు బెర్బరులను నొక తెగవారుండుటచేత ఈభాగమునకు బార్బరీ రాజ్యములని పేరు వచ్చెను.

పశ్చిమ ఆఫ్రికాయందలి రాజ్యములు —సహారా యెడారికిని, గినీతీరమునకును, మధ్యగాంబియా, గోల్డుకోస్టు, సియోరాలియోన్, లైబీరియా నైజీరియా, సూడాన్, అషాంటీ రాజ్యములు, గలవు

తూర్పుఆఫ్రికాయందలి రాష్ట్రములు —ఆఫ్రికాఖండపు తూర్పుతీరమున ఉగాండా, కెన్యాటాంగనీకా, న్యాసాలాండు, ఉత్తర రొడీషియా, మొజాంబిక్ రాష్ట్రములు, గలవు.

దక్షిణఆఫ్రికా యూనియనులోని రాజ్యములు - కేప్ ఆప్ గుడ్‌హోప్, ట్రాన్సువాలు, ఆరంజి ఫ్రీస్టేటు, నెటాలు, బెచూనాలాండు రాష్ట్రములు, జులూలాండు, టాంగాలాండు స్వదేశరాజ్యములు దక్షిణ ఆఫ్రికా యూనియనులో చేరియున్నవి.

## ముఖ్యపట్టణములు

ఫెజ్ —ఇది మొరాకో రాష్ట్రమునకు ముఖ్యపట్టణము ఇచ్చట అందమైన టోపీలు తయారు చేయుదురు.

2. టాంజీరు —ఇది మొరాకో రాష్ట్రమునకు రేవుపట్టణము. దీనికెదురుగ జిబ్రాల్టరు జలసంధిగలదు

3. ఆల్జియర్సు —ఇది ఆల్జీరియా దేశమునకు రాజధాని నగరము, ముఖ్యమగు రేవుపట్టణము. ఇచ్చటనుండి ఖర్జూరము, ద్రాక్షసారాయి, ఆలివ్ నూనె, ఎగుమతి-చేయబడుచున్నవి.

4. ట్యూనిస్ —ఇది ట్యూనిస్ రాష్ట్రమునకు ముఖ్యపట్టణము, రేవుస్థలమై యున్నది. సిసిలీ ద్వీపమునకు సమీపమునున్నది.

5. ట్రిపోలీ —ఇది లిబియాదేశమునకు ముఖ్యపట్టణము. రేవుస్థలము బిడారి వర్తకమునకు స్పాంజి వ్యాపారమునకు ప్రసిద్ధి.

6. కైరో —ఈజిప్టు దేశమునకు రాజధాని-నగరము. నైలునది యొడ్డుననున్నది. దీని సమీపమున పిరమిడ్లుగలవు. కరాచీనుండి లండనుపోవువిమానములిచ్చట ఆగును.

7. అలెగ్జాండ్రియా —ఈజిప్టుదేశపు ముఖ్యమైన రేవుపట్టణము. ఇచ్చటనుండి ప్రత్తి బొంబాయి ఎగుమతగును.

8. ఆస్వాను —ఈపట్టణమువద్ద నైలునదికి ఆనకట్ట గలదు.

9. టింబక్టో —నైజరునది మీదనున్నది. బిడారి వర్తకమునకు ప్రసిద్ధి.

10. కానో — నైజీరియా రాష్ట్రమునందున్నది. బిడారువర్తకమునకు ప్రసిద్ధి తోలుసామానులు, మట్టి పాత్రలు తయారుచేయుదురు.

11. నైరోబి — కెన్యారాష్ట్రమునకు ముఖ్య పట్టణము. ఇచ్చట నాటకశాలలు గ్రంథాలయములు, చూడదగినవి.

12. మొంబాసా — ఇది ఆఫ్రికా తూర్పుతీర మునున్నది. కెన్యారాష్ట్రమునకు రేవు పట్టణము. ఇచ్చటనుండి ప్రత్తి, కాఫీ, ఏనుగుదంతములు ఎగుమతగును.

13. జాంజిబారు — ఆఫ్రికా తూర్పుతీరమున పగడపు పురుగులచేత యేర్పడిన చిన్న ద్వీపము. దీనికి జాంజిబారు ముఖ్యపట్టణము. ఇది లవంగములకు ప్రసిద్ధి. ఇచ్చట కొబ్బరి, మామిడితోటలు గలవు.

14 జోహన్సుబర్గు — ఇది ట్రాన్సువాలు రాష్ట్రమందు గొప్ప పట్టణము దీని సమీపమున "రాండు" జిల్లాలో బంగారము లభించును.

15. ప్రిటోరియా —ఇది ట్రాన్సువాలు రాష్ట్రమునకు ముఖ్యపట్టణము. వజ్రములకు ప్రసిద్ధి. దక్షిణ ఆఫ్రికా యూనియనువారి కార్యనిర్వాహక సభ లిచ్చట గలవు.

16. కింబర్లీ —ఇది దక్షిణ ఆఫ్రికాలో గుడ్ హోప్ రాష్ట్రమందలి పట్టణము. ఇది వజ్రములకు ప్రసిద్ధి.

17. డర్బన్ -ఇది ఆఫ్రికా తూర్పుతీరమున దక్షిణ భాగమునున్న రేవుపట్టణము. ఇచ్చటనుండి నేలబొగ్గు బంగారు ఎగుమతి అగును. నెటాలు రాష్ట్రమందలి పంటలు లోహములు విదేశములకు ఎగుమతిఅగును.

18. కేపుటౌను — ఇది అట్లాంటిక్, హిందూ మహాసముద్రముల నడుమనున్న గొప్ప రేవుపట్టణము. ఇచ్చటనుండి తోళ్ళు, ఉష్ట్రపక్షి ఈకలు, బంగారము, వజ్రములు, ఉన్ని, పండ్లు, ముఖ్యమగు ఎగుమతులు. ఇది దక్షిణ ఆఫ్రికా యూనియను పార్లమెంటు ఉండు చోటు.

19. పోర్టుఎలిజబెత్తు — ఈ రేవుపట్టణమునుండి ఉన్ని ఇతరదేశముల కెగుమతి అగును.

దేశములు — పంటలు

1. బార్బరీరాజ్యములు —గోధుమలు, బార్లీ, ద్రాక్ష నిమ్మ, నారింజ, ఆలివ్, అత్తి, పండ్లతోటలు.
2. సహారాయెడారి —గోధుమలు, బార్లీ, ఖర్జూరము (ఒయాసిస్సులందు)
3. ఈజిప్టు — వరి, ప్రత్తి, చెఱకు, జొన్న గోధుమ, చిక్కుడు, బటాని, నారింజ, అత్తి, నిమ్మ, తోటలు.
4. పశ్చిమ ఆఫ్రికా —కోకో, తాటినూనె, వరి, జొన్న, బంగాళాదుంపలు.
5. కాంగోనదీమైదానము — ప్రత్తి, చెఱకు, వరి, పొగాకు.
6. తూర్పు ఆఫ్రికా —ప్రత్తి, జొన్న, కాఫీ, గోధుమ, బార్లీ.
7. దక్షిణ ఆఫ్రికా — గోధుమ, నిమ్మ, ద్రాక్ష, నారింజ, ఆలివ్ తోటలు (నైఋతిభాగమున చెరకు, ప్రత్తి, పొగాకు, తేయాకు, జొన్న, -మొక్కజొన్న, (తూర్పు భాగమున)

## ఇతర విషయములు

టెల్ —అట్లాసు పర్వతములకు, మధ్యధరా సముద్రమునకు, మధ్యనున్న మైదానము. ఇచ్చటమధ్యధరాసముద్ర శీతోష్ణస్థితి గలిగియుండును.

షాట్సు — అట్లాసు పర్వతములకు దక్షిణమున నున్న పీఠభూమి. ఇందు ఉప్పునీటిసరస్సులు. మెండు ఇచ్చట ఎస్పార్టోయను గడ్డి విశేషముగనుండును. ఇది కాగితముచేయుట కుపయోగించును.

సైమూన్ — సహారాయెడారు లందలి ఇసుక తుపానులకు సైమూనులని పేరు.

పిరమిడ్లు — ఈజిప్టుదేశమందు కైరోపట్టణమున కుసమీపమున పూర్వకాలపురాజుల గోరీలుగలవు. అవిచాలయెత్తైన కట్టడములు. వీటికి పిరమిడ్లని పేరు.

ఆఫ్రికాఖండమునకు ఎగుమతులు — నూలు, నూలు, బట్టలు, బియ్యము, ఆఫ్రికాఖండమునుండి దిగుమతులు — ప్రత్తి, లవంగములు, నేలబొగ్గు.

(సశేషము)

## విధివిలాసము

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

తే. గీ. సాంద్రమై భీకరక్రూరసత్త్వములకు । నిలు వగుచు జీమమైనను జొరగలేని
కాకియుం దూ అరానట్టి కారడవులఁ । బయన మొనరించుచుండెను. పాఁఱుడొకడు.

ఆ. వె. అట్లు లేగుచుండ నపరాంబునిధిఁ గ్రుంకె । సూరి యంత నంధకార మెల్ల
వ్యాప్తమయ్యె నంత నమ్మహారణ్యాన జంతు తతికి నెల్ల సాయపడగ

ఆ. వె. కన్ను పొడుచుకొన్న కానరానట్టి యా । తమమునం దతండు దారి దప్పి
చివర కెట్లొ గాంచె చెఱువొక టంతట నచట నుండఁదలచి యాఁగిపోయె.

తే. గీ. సరసిలో దిగి స్నానంబు సలిపి పిదప నత్తైసరు బెట్టి వండుకొం చాహరింప .
జపము సేయుచు ధ్యాననిష్ఠానిమగ్నుఁ డగుచు లోకంబు మరచెనా యవనిసురుఁడు.

తే. గీ. అతఁడు నీటను దిగునట్టి యదనుజూచి । ఎగసి కుప్పించి పైఁబడి యీడ్చుకొంచు
సలిలమధ్యంబునం దన నెలవుఁ జేరి । కబళనము సేయఁదలచె నక్రం బొకండు.

తే. గీ. అపుడె నరునుక్క పసివట్టి యచట కేగి । సమయముం జూచి యాతని సమయఁజేసి
మెసవగా నెంచి మువ్వన్నె మెక మొకండు కుంజములమాటుగా నక్కికొంచునిలిచె.

ఆ. వె. ఒక్కవంక వ్యాఘ్ర మొకవంక మొసలియుఁ । గాచుకొనియు నుండె గ్రసనమునకు
ఉటికి మీదఁ బడెడు నుత్తరక్షణమున । నేమి జరుగఁగలదొ ఈశ్వరాజ్ఞ.

తే. గీ. చిదుగుకట్టెల పొయిమంట చెదరకుండ । నడ్డముగ నున్న యొక తాటియాకుగొగుడు
మిడిసిపడి రేగి వీచుసమీరణమున కెగిరిపడె చెఱువులోన నదే మొకాని.

తే. గీ. బ్రాహ్మణుఁడు నీటఁబడెనని భ్రమను జెంది । దూకె నీటను బులితాను దుడుకుపడుచు
బాపఁడే నీటఁ బడెనని వారిచరము । వ్యాఘ్రమును గబళించి సాపడియె నంత

తే. గీ. నిశ్చలంబగు భక్తితో నిన్నుఁ దలచు । మనుజులం దయతోఁ గాచు మానసీయ
మహితకీర్తిప్రభావ ! ప్రేమస్వభావ । అవ్యయానందరూప జోహారునీకు!

---

## ౨. పిలుపు - యుద్ధప్రచారపుపాట -

(రావే రావే బంగరు పాపా - వరుస)

1. రండీ రండీ సోదరులారా ! రణభూమికి మన మేగుదము
వేగమె శత్రూలనూనిర్జించి - జయమును గొందము ! "రండీ"

2. శౌర్యము మెరయా, ధర్మము వెలియా, శత్రువులను నురుమాడుదము
జయమూ, మనకు, శాశ్వతమూ, సంతోషమె, మన యాశయము.

3. దేశగౌరవమె, మనగౌరవము, దేశరక్షమె, మనపరమావధి
బానిసత్వము, మనకదియేలా ? స్వాతంత్ర్యమె, మన యానందం,
ఆనందం, ఆనందం, ఆనందం, పరమానందం రండీ!

4. నాజీ ఫాజీ మూకల ద్రుంచి – జపాను రాక్షసి ననిలోఁజంపి
మిత్రమండలికి విజయముగూర్చి – మేలనిపించ వేగమెరండీ రండీ రండీ


రచయిత – బి. మార్గరెట్ ఇలిజబెత్

---

## ౧. విద్యాప్రచారపు పాట

(బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య.)

(రైతు పైని అనురాగము జూపని వరుస)

1. చదువులేనిదే సభ్యతలేదని – సరవిగ నెంచవదేలా
చదువనంటె యశ్రద్ధను జూపెదు – ముదమొదవునె యిదియు॥ చదువు.
2. పరదేశాలలో బంధువుపోలిక – బాసటయై మనుగదా
తస్కరుకందని ధనమేయిదియని – తలచుకొనుము మదిలో॥ చదువు
3. బడికినేగక నాటలనాడెదు – బాగని మెత్తురె బుధులూ
బడికినేగుచు విద్దెనునేర్చుచు – పండితుండ వగుమా॥ చదువు.
4. చదువువలన నజ్ఞానము వోవును – సందియ మదియేలా.
లెమ్ము బాలకా ! విద్యనునేర్వగ – లెస్సయైన యనురక్తిఁ. చదువు



---

# పద్యకథలు

కె. ఎ. స్వామి

పద్యకథలు అనగానెట్టివి ? అవియే సారస్వత శాఖకుచెందినవి? మనభాషలో పద్యకథకుగల స్థానమేమి ? పద్యకథ లెట్టిస్వరూపమును కలిగి యుండవలెను ? అనునవి విచారించిన పద్యకథలవిలువ సులభగ్రాహ్యమగును.

## పద్యకథలనగా నెట్టివి ?

నవ్యసాహిత్యముక్రొత్తసీసాలోనుంచినప్రాతపానీయము భాషలో మాటలు, అర్థములు, పూర్వపువేఅయినాకూర్పు, నేర్పు, వలన వానికి ఒక్కొకచోట అపూర్వ శోభరావచ్చును. ప్రాతదాని పరిణామమేక్రొత్త ప్రాతసారస్వతమే కూర్పు నేర్పువలన క్రొత్తరూషము దాల్చుచున్నది. ఇది క్రొత్తప్రాతల అవిచ్ఛిన్నత "క్రొత్తపాతల మేలుకలయిక" అని గురజాడకవి నుడివినాడు. యువకకవులు సాంప్రదాయసిద్ధమైన పురాతన ఛందస్సునేగాక క్రొత్త దారులు సృజించుచున్నారు. బహుభాషాపరిచయముగల వారలిందు ముందంజవేయుచున్నారు. నవ్యసాహిత్య ప్రధానాంగములు ఖండకావ్యము, కథానిక, ఏకాంకనాటికలు. సారస్వత శాఖలలో ఖండకావ్యమొకటి. దీనిరూపు ఏకాశ్వాస ప్రబంధము

వంటిది. సుమబాల, పంచవంటి, సమాధి, శబరి, షాజీ; అమృతసిద్ధి, గబ్బిలము, ఫిరంగీకిరాతము, కీర సందేశము, మొదలైన గ్రంథములిట్టివే. వీనినే ఖండ కావ్యములని కాని, పద్యకథానికలనికాని, చెప్ప వచ్చును. దీపావళి, తోలకరి, ప్రతిభ, ఓరుగల్లు, సౌభద్రుని ప్రణయయాత్ర, ఖండ కావ్యములు (జాషువా) దేవులపల్లివారి ఖండకావ్యములు కృష్ణ పక్షము మున్నగునవి) మొదలగునవి ఖండకావ్య సంపుటములు. వీనిలోని యొక్కొక్క శీర్షికయు నొక్కొక్క కావ్యముగా గణించుచున్నారు. వీనిరూపు పూర్వకవుల చాటువుల వలెనుండును,ఖండ కావ్యములలో కథనుగైకొని రచనసాగించుటయే ముఖ్యలక్షణముగాదు. పాత్రపోషణకొఱకును, రసా నందము కొఱకును, సారకత కొఱకును, ఉత్కృష్టత వెల్లిబుచ్చుచు, నిజరూపభావ సౌందర్యములు చెడి పోకుండ, కవి మారుడు కథను చమత్కృతితో నడుపవలయును. విశ్వ గర్భమున మాటుమణగియున్న పరమాత్మ స్వరూ పమును, విశ్వవ్యాప్తమైన దివ్యగానమును, కావ్యము కలిగియుండి శాశ్వతత్వమును దాల్చవలెను. కావ్య ములో మర్మమర్మమును, అవ్యక్త మధురమై యుండ వలెను. ఉన్నతోద్దేశమును, నిశితమైన భావమును, గంభీరమగు సౌష్టవమును, కావ్యమున కలంకార ప్రాయములు. అట్టిచో కావ్యముపద్యకథ గానేరదు. కాని పద్యకథానిక (ఖండకావ్యము) యొక్క సంగ్రహరూపమే. కథా పద్యమని చెప్పవలయును. ఇది క్లుప్తరసవద్రచన. ఇందుకథప్రధానమైనది. దీనికి పఠన యోగ్యత, శ్రవణయోగ్యతలు గూడగలవు. నాటికలు, నాటకములు, ప్రహసనములు, రచనా సౌలభ్యమునకొకేవృక్షశాఖవైనట్లుపద్యకథలు, ఖండ కావ్యములు, చాటువులు, ఒకేవృక్షమునకు చెందిన శాఖలు.

## వివిధభాషలలోని పద్యకథలు

ఈ విధమైన పద్యకథలు ప్రాచీనులుగూడ అనేక భాషలలో రచించిరి. మన భాషలోమాత్రము ఇప్పటి వరకు ఉద్దేశపూర్వకముగా రచింపబడిన పద్యకథలు (Story poems) కాన్పింపవు. సంస్కృతములో పద్యరూపమున కథలు వెలువడినవి. శ్లోకముల లేక చిక్కువడిన ఛాందసులకథ, సాలెవానికథ, కాళిదాస భవభూతుల కవితాతారతమ్య విమర్శకథ, మున్నగు కథలన్నియు కవితాచమత్కారకవితములైన శ్లోకము లతోనే సంధింపబడియున్నవి. అనేకములగు చిన్న కథలు పంచతంత్రములలో సంపుటీకరింపబడి యున్నవి. జగన్నాథ పండితరాయలకు రంగానోక్తి గూడ పద్యకథయే. ఈకథ యందైదు శ్లోకములు మాత్రముగలవు. ఆంగ్లభాషలో పద్యకథల మితముగా రచింపబడినవి సుమారాంగ్ల కవులని ప్రసిద్ధిజెందిన వారల నేకులు పద్యకథలు లిఖించిరనియే చెప్పవలెను. కౌపరు, మిల్టన్, టెన్నిసన్, వర్డ్సువర్తు, టైలరు, మున్నగు కవుల నేకులు పద్యకథలు రచించియున్నారు ప్రస్తుతము తెలుగుభాషలో వ్రాయబడుచున్న పద్య కథ (Story poems) లకు మూలమియాంగ్ల కవి శ్రేష్ఠుల పద్యకథలే. పద్యకథలు వ్రాయుటలో పరిపూర్ణతను పొందిన వారాంగ్లకవులని సమ్మతించ వచ్చును.

## తెలుగులోని ప్రాతకథలు

మన తెలుగుభాషలోగూడ పద్యకథలుగలవు. కాని యవి దీర్ఘములై, శైలియుతములై, వర్ణనా సహితములై కథలుగా గాక కావ్యములుగా ప్రసిద్ధి జెందినవి. దూబగుంటనారాయణకవి పంచతంత్ర మిట్టిదియే. నీతులను సంఘునీతులను, యుక్తాయుక్త మును, గరవుకథలుగూడ రచింపబడినవి. అనంతా మాత్య ప్రణీతమగు భోజరాజీయమిందుల కుదాహృ తము. ఇందుకవి కథలను పొందుపరచుటలో తన నేర్పును చక్కగా చూపినాడు. భావమును పెడ త్రోవలు పట్టకుండ చేపట్టినాడు. కథాకల్పనయందు వానిని చెప్పధోరణియందును, ఈ కవి చూపిన వైదగ్ధ్యము సునిశితమైనది. కథను చమత్కారకవిత ముగా రచించుటలో ఈకవి అందెవేసినచేయి.

(సశేషము)

# ఉపాధ్యాయసంఘములకు విజ్ఞప్తి

**సోదరోపాధ్యాయులారా !**

1939 సం॥రపు విద్యాప్రణాళిక ననుసరించి యీ రాజధానియందలి ప్రతి ప్రాథమిక పాఠశాలలోను 4,5 తరగతులకు నిర్బంధముగా హిష్టరీ, సివిక్సు, నేచరుస్టడీ భూగోళశాస్త్రములను బోధించి, శ్రీ ప్రభుత్వమువారి యుద్దేశమును సఫలీకృతమొనర్చి విద్యార్థులను విజ్ఞానవంతులుగ నొనర్చవలసిన భారము మనపై యున్నది.

కానినూతన విద్యాప్రణాళిక ననుసరించి, విద్యార్థులచేపాఠ్యగ్రంథములనుప్రతి విషయమునకును ఆర్థికస్థితి మందగించిన యీ రోజులలో కొనిపించజాలము. పాఠ్య గ్రంథములు లేనిచో విద్యార్థులచే నోట్సు వ్రాయించుటకు మనము పూనుకొనినచో సాగరమీదప్రయత్నించుటవంటిదే యగును. అరదు చాల తరగతులు బోధించు ఉపాధ్యాయ సోదరుల స్థితి అనూహ్యము. ఈ పరిస్థితులలో

శ్రీ తాతా జగన్నాథరావు, కీ. శే. వేదుల అన్నయ్యశాస్త్రిగార్లచే రచింపబడి 1941 సం॥ రం డిశంబరు నెలనుండి ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రిక యందు ప్రచురింపబడిన 4, 5 తరగతుల హిష్టరీ, సివిక్సు, నేచరుస్టడి, భూగోళశాస్త్ర ప్రశ్నోత్తరములు, భూగోళపాటలు, ప్రాథమికపాఠశాలోపాధ్యాయులకు, విద్యార్థులకు చాల సహాయకారిగా నున్నవి. ఈ విషయము రసగ్రహణపారీణులగు ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా పాఠకులెల్లరకు విశదమే. శ్రీ ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా పత్రికా సంపాదకు లీవిషయమునుగూర్చి తమ సంపాదకీయములలో అనేకసార్లు వెల్లడించిరి. మన కీతరుణమున ఈ ప్రశ్నోత్తరములు తరగతికొక పుస్తకము చొ॥ ఈ ప్రశ్నోత్తర ములకు సంబంధించిన నాల్గుసబ్జక్టులతో ప్రత్యేక గ్రంథములుగా లభించినచో మన పాఠశాలలలోని విద్యార్థులకు పెన్నిధి లభించినచందముననుండును. ఇట్లుండ,

ఈ ప్రశ్నోత్తరములను ప్రత్యేకగ్రంథములుగా ప్రకటించి ప్రాథమికవిద్యా ప్రపంచమున కందజేయవలసినదని యెందరో ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు, విద్యార్థులు, విద్యాభిమానులు, ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా పత్రికాధికారులను కోరగా, కాగితపుకఱవువలన ఆ కోర్కె నెరవేర్పజాలకపోతిమని వారు పత్రికా ముఖ మున సెలవిచ్చియుండిరి.

సోదరులారా !

సంఘీభావమే బలము. మనమందరము మన సంఘములలో ఈప్రశ్నోత్తరముల ఉపయోగములను విపులముగా విమర్శించి, యీ దిగువరీతిగా తీర్మానించి, ఆ తీర్మాన మును శ్రీ ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా పత్రికాధికారుల కంపినచో వారు మనకోర్కెను నిరాకరింపజాలరు. స్కూలునకు కనీసము 12 పుస్తకముల చొప్పున ఒక్కొక్క తాలూకాలో అధమము 500 పుస్తకములు (ఒక్కొక్క తరగతివి) వినియోగపడుట

కెట్టి సందేహముండదు. "నీరు చొరక లోతు నిజముగా తెలియదు" అను సామెత మీ రెరుగనిదికాదు.

కావున యీతీర్మానము తమ సంఘములలో తీర్మానించి ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్యా మాసపత్రికకు త్వరలో పంపప్రార్థన.

తీర్మానము.—నూతనవిద్యా ప్రణాళిక ననుసరించి శ్రీ తాతా జగన్నాధరావు కే. శే. వేదుల అన్నయ్యశాస్త్రిగార్లచే రచింపబడి 1941 సం॥రం డిశంబరు నెలనుంచి ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా పత్రికలో ప్రచురింపబడిన 4, 5 తరగతుల హిష్టరీ, సివిక్సు నేచర్ స్టడీ, భూగోళ ప్రశ్నోత్తరములు, ప్రాథమికపాఠశాలా ప్రపంచమునకు చాలవరకు సహాయపడుచుండుటచేతను, ప్రశ్నోత్తరముల మూలమున ఆవశ్యకమగుజ్ఞానమును స్వల్ప పరిశ్రమతో విద్యార్థులు పొందుట కవకాశములుండుట చేతను, విద్యాప్రబోధమువిజయ వంతముగనుండుటచేతను, విషయానుక్రమణిక ననుసరించి సరళభాష నియ్యవి వ్రాయ బడుటచేతను, ప్రత్యేక గ్రంథములుగా నీ ప్రశ్నోత్తరములు ప్రచురింపబడినచో విరివిగా విద్యార్థులచే ప్రతిపాఠశాలయందును వినియోగింపబడుట కెట్టి సందేహ ముండదని మేమభిప్రాయపడి, కాగితపు కరవాలోచింపక, త్వరలో ప్రత్యేక గ్రంథ ములుగా యీ ప్రశ్నోత్తరములను తరగతి కొక పుస్తకము చొప్పున ప్రచురించి, ప్రాథమిక విద్యా ప్రపంచమున కందచేసి, విద్యాసేవచేయవలెనని శ్రీ ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రికాధికారులను కోరడమైనది."

మనవి:—యీ పైతీర్మానములో సవరణలవసరమైనచో తగు మార్పులు తమకు తోచినవిచేసి, త్వరలో ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రికాధికారుల కంపి, వారి దయాభిమానములనుపొంది, మన ప్రయత్నమున విజయమునొంది, రచయితల యుద్దేశ్యము నెరవేరు నటుల చేయవలెనని విన్నవించుచున్నాను.

Kolavani Palem
Agraharam.
30—8—1943.
Tangudubilli Bo
(Via) Waltair Rs.

ఇట్లు,
I. Ch. Lakshmanacharyulu,
Secondary Grade Teacher.

---

# విద్యావిహారము

ఆగష్టు నెల 16 వ తేదీన అనంతపురములోనుండు గవర్నమెంటు ఉపాధ్యాయిని బోధనాభ్యసనోన్నత పాఠశాలనుండి గణితశాస్త్ర సహాయోపాధ్యాయిని యగు శ్రీమతి టి. పద్మావతమ్మ గారు బి.ఏ.ఎల్.టి. మరి పదునలుగురు బోధనాభ్యసనోపాధ్యాయినులును విద్యావిహారార్థమై పామిడి గ్రామమునకు విచ్చేసిరి. వారికి వలయు వసతులును ఆ సమయమునకు అచ్చట చేరియున్న శ్రీ కె. క్రిష్టప్ప, అనంతపురము రేంజి జూనియరు డెప్యూటీ యినస్పెక్టరుగారు, పామిడి పంచాయితీబోర్డు అధ్యక్షులగు శ్రీ. టి. నారాయణరెడ్డి, పామిడికమిటీ స్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ యన్. బి. సంపత్కుమార్ గార్లు యేర్పాటుగావించిరి

ఫలహారానంతరము శ్రీమతి టి. పద్మావతమ్మ

గారు, శ్రీ. క్రిష్టప్పగారు, ఉపాధ్యాయినీ బృందములో గ్రామపర్యవేక్షణముగావించి తదుపరి గ్రామములో ప్రాథమిక, బాలబాలిక పాఠశాలలకు వెళ్ళి అందలి విద్యావిషయక వస్తువులను చిత్రవస్తు ప్రదర్శనములను, తిలకించిరి. లండను మిషనువారి యాజమాన్యము క్రింద నడుపబడుచున్న బాలికా పాఠశాలలో బాలికలచే ప్రదర్శింపబడిన నృత్యగీతములు, గొబ్బిపాటలు, కోలాటము మొదలగునవి చూచి ఆనందించిరి. పిమ్మట ఉపాధ్యాయినులు పై పాఠశాలనుండి గమనింపవలసిన వివిధవిషయములను గమనించిరి. పై పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీ. కె. జె. దేవదాసు వారి సతీమణి శ్రీ. సుదర్శనమ్మ మరియు సహాయోపాధ్యాయిని శ్రీ విజయమ్మగారిని వారి చేతిపనుల విషయమున్ను పాఠశాలానిర్వహణమును గురించి ప్రశంసావాక్యములను వ్రాసి బయలుదేరి కమిటీస్కూలు చేరిరి.

కమిటీస్కూలు నందలి విద్యావిషయక వస్తువులను దర్శించిరి. పాఠశాలా నిర్వహణమునకై వలయు పరికరములను గమనింప జేసిరి. పాఠశాలయందలి రికార్డులుంచు విషయమై ప్రతి విషయమును ప్రధానోపాధ్యాయులగు శ్రీ. యస్. బి. సంపత్కుమార్ గారు విశదీకరించి రికార్డులను ప్రదర్శించుచూ, ఉపాధ్యాయినులకు తెలియజేసిరి. ఉపాధ్యాయినులందరు వారు వివరించిన ప్రధానాంశములను కుతూహలలై విని పాత్రములలో బొందుపఱచుకొనిరి. మధ్యాహ్నసమయము కాగా పాఠశాలవిడిచి తమ విడిదికేగి భుజించిరి.

విశ్రమానంతరము వారందరును ఇంతకుమునుపు కృషీవలులైయుండి ప్రస్తుతము కోటకమహారాజుగారి కనుసన్నలకులోనై కూలికి కడుపుమంట గాచుకొనుచున్న కరువు పనుల కేంద్రములను దర్శించిరి. మూగియున్న ప్రజల దురవస్థంగాంచి చేయునదిలేక వెనుదిరిగిరి.

సాయంకాలమున కమిటీస్కూలునందు ఒకసభ జరుపబడెను. గ్రామమందలి ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులందరు సభ కరుదెంచిరి. నాటి సభకు శ్రీమతి టి. పద్మావతమ్మగారిని అధ్యక్షురాలినిగా నెన్నుకొనిరి. కరతాళధ్వనులమధ్య ఆమె వేదిక నలంకరించెను. ప్రార్థనానంతరము శ్రీ యస్. బి. సంపత్కుమార్. విద్యావిషయము పాఠశాలా నిర్వహణమును గురించియు, ముచ్చటించిరి. శ్రీ కె. జే. దేవదానుగారున్ను పైవిషయమై మాట్లాడిరి. తదుపరి శ్రీ. కె. క్రిష్టప్పగారు (జె. డి. ఐ) ప్రాచీన విద్యావిధానమునకు నేటి విద్యా విధానమునందలి లోటుపాటనుగురించి దీర్ఘోపన్యాసమిచ్చిరి.

శ్రీమతి టి. పద్మావతమ్మగారు తమ అంత్యోపన్యాసమున ప్రాథమికపాఠశాలలు, అందలి ఉపాధ్యాయులు, వారిబాధ్యతను, మరియు ఉన్నత పాఠశాలలలందలి విద్యాధికులగు ఉపాధ్యాయులకులు గలబాధ్యతలనుపోల్చిచెప్పిరి. పిమ్మట కమిటీస్కూలు నిర్వహణమును గురించియు, ప్రధానోపాధ్యాయుడు తన బాధ్యతలను బాగుగ గుర్తెరిగి తన్ను ఇతరులు అనుకరించులాగున రికార్డులనుంచెననియు ప్రశంశావాక్యములనువ్రాసి మంగళ సమర్పణములతో సభ చాలించిలేచిరి. గ్రామమందలి ముఖ్యదేవాలయములను దర్శించి, ఒకప్పుడు మిక్కిలి వృద్ధిలోనుండి ప్రస్తుతము క్షీణించియున్న రంగద్దకపుపనులను దర్శించినాటి రాత్రికి ఉపాధ్యాయినులతోగూడి అనంతపురము వెళ్ళిరి.

యస్. బి. సంపత్కుమార్ 1—9—43.

---

# తూర్పుగోదావరిజిల్లా ఎయిడెడ్ టీచర్సు యూనియను

# మండపేట

## ఉపాధ్యాయులకు సలహాలు :

సోదరులారా!

ఈ ప్రపంచయుద్ధము తాకిడి మనకు గట్టిగా తగులుచున్నది. మనకువచ్చు జీతములా స్వల్పము. జీవనముచేయుటే కష్టతరముగానున్నది. స్వార్థపరులగు మానేజరులింకను జీతముల విషయములలో బేరములాడుచునే యున్నారు. సర్వీసు రిజిష్టరు నామమాత్రమైనది. ఇట్టితరి ధైర్యముతో మీతాలూకా యూని

యనుకు బలమునిచ్చిన. అది మీ కష్టములు పోగొట్టుటకు ప్రయత్నము చురుకుగా చేయగలదు. ఈ క్రింది సలహాలను గమనించి అట్లు నడచుకొనవలెనని టీచర్లను హెచ్చరించడమైనది.

1. నీవు యూనియను సభ్యుడవై, చందాలను చెల్లించి, క్రమ శిక్షణ కలిగియుండుము.

2 యుద్ధానంతరమైనను, ఈ మేనేజిమెంట్లుపోయి బడులన్నిటిని గవర్నమెంటువారే తీసుకొనునట్లు చేయుటకు మీ యూనియను యిచ్చు కార్యక్రమములో నీశక్తికొలది పాటుపడుము.

3. యూనియను మీటింగులకు తప్పక హాజరుకమ్ము.

4. బడిలో నీపనిని త్రికరణశుద్ధిగ చేయుము.

5. నీవిజ్ఞానమును ప్రతిదినము పెంపొందించుకొనుము.

6. ప్రతి 15 దినములకు మీ సెంటరు ఉపాధ్యాయులందరును ఒక కేంద్రమున సమావేశమై మీ కష్టసుఖములను చర్చించుకొని మీ యూనియనుకు తెలియచేయుడు.

7. నీ ఆత్మగౌరవమును మరువకుము. ఎవరైన భంగము కలిగింపచూచిన ఊరకొనకుము.

8. సర్వీసు రిజిష్టర్లు, సర్వీసు, కండిషన్లు ఉండగ ప్రయివేటు బేరములు పెట్టుకొనకుము. జీతము ముట్టనిదే అక్విటన్సులో సంతకము చేయకుము.

9. సర్వీసురిజిష్టరులో నమోదుకాబడిన జీతము తీసుకొను విషయమై నీవు మిక్కిలి పట్టుదల వహించవలెను. అందలి సాధకబాధకములనుగూర్చి మీయూనియను వారి సలహా పాటింపుము.

10. గ్రాంటు రాగానే, మీ మేనేజరు మీ కివ్వని పక్షములో వెంటనే మీ యూనియనువారి సహాయముతో ఆవిషయములు అధికారుల దృష్టికి తెమ్ము. ధనముదగ్గర మొగమాటము పనికిరాదు.

ఎ. నీలకంఠము

ది 27—8—43.　　　　కార్యదర్శి.

To

## His Excellency The Governor of Madras.

Through

THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, MADRAS.

May It Please Your Excellency,

The humble representation of the

most respectfully showeth as follows.

That while thanking the Government of Madras for granting a dearness allowance of Rs. 2 per mensem, the scales of the Aided Elementary School Teachers are too low to cover the costs of rice even, in these hard days, not to speak of other bare necessities of daily life, and hence entreats that the scales of pay may kindly be raised to be on a par with the scales minima of the Local Boards' Teachers, and as is being paid since 3 or 4 years to the aided teachers in the agency areas.

That the grants be paid monthly instead of quarterly, since nearly 90% of the Aided Managers depend upon Government aid, and since the credit system has vanished from today markets, and since the aided teachers feel very hard to lead their lives.

That the memorialists are the best medium of enormons war propaganda among the public for the defence of India from invasion, to crush all alarming rumours, to buy defence bonds, to grow more food, and to help the Government by sending men and money and thus contribute to the early victory of the allies.

And that favourable orders be passed with sufficient allotments also at an early date failing which the memorialists will have to starve to death.

We make this much of appeal for the mercy of his Excellency the Governor of Madras

We beg to remain,
May it please your Excellency,
The most obedient servants
of the Government.

Copy submitted direct to save delay.

ఉపాధ్యాయ సోదరులారా !

ఈ మెమోరియల్ కాపీలు 2 తీసుకొని ప్రతి తాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియను, టీచరు మేనేజర అసోసియేషను, జిల్లాటీచరు మేనేజర్ల అసోసియేషను, జిల్లాఎయిడెడ్ టీచర్ల యూనియను, ఒకటి శ్రీ ఘనతివహించిన మద్రాసు గవర్నరు గార్కిని, రెండవది శ్రీ మద్రాసు డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారికిని, వీలైనంతమంది టీచర్లచేత సంతకములు చేయించి పంపి మనకష్టములను ఏకముఖముగా తెలియచేసి సక్రమ ఆందోళన జరుపవలసినదిగా కోరుచున్నాము. మన ఆంధ్రరాష్ట్రమందలి ప్రతి తాలూకా యూనియను ఈ మెమోరియల్ పంపునట్లు ప్రతి ఎయిడెడ్ ఉపాధ్యాయుడును శ్రద్ధవహింపవలెనని కోరుచున్నాము. ఈసెప్టెంబరు నెలలోగా అన్ని తాలూకాల యూనియన్లు పంపవలెను.

ఇట్లు సంఘసేవకులు,

A. Neelakantam,
Secretary.
The East Godavary District Aided Teachers Union.

Ch. K. S. Sarma,
Secretary.
The East Godav ary District Teacher Managers' association
MANDAPETA.

## తూర్పుగోదావరి జిల్లా ఉపాధ్యాయ యాజమాన్య సంఘము

[R. Dis. 13/43] కార్యస్థానము: మండపేట [ది 2-9-43.]

ది 29-8-43 వ తేదీని అమలాపురంలో సంఘాధ్యక్షులగు శ్రీ యం. సూర్య ప్రకాశరావు, బి. ఎ. బి. యి. డి. వారి ఆధిపత్యమున జరిగిన 2 వ స్థాయీ సంఘసభా తీర్మానములు — హాజరు 6-14.

(1) ప్రస్తుత సంగ్రామమున మిత్రమండలికి విజయము చేకూరుగాక.

(2) మనజిల్లా విద్యాశాఖాధికారి వారి "పర్సనలు అసిస్టెంటు" శ్రీ. ఆర్. జె. గిడ్డిగారి ఆకాల మృత్యువునకు యీసంఘమువారు సంతాపమును వెలిబుచ్చుచు, వారికుటుంబమునకు తమ సంతాపమును తెలుపుచు, శ్రీ వారి ఆత్మకు శాంతినొసంగుగాకయని భగవంతుని వేడుచున్నారు.

(3) శ్రీ క. సీతారామయ్య, శ్రీ. పి. కోటేశ్వరరావుగార్లను యీసంఘ స్థాయీసంఘ సభ్యులుగా కోఆప్టుచేయుటకు,

(4) శ్రీ, క. సీతారామయ్యగారిని ఉపాధ్యక్షులుగా యెన్నుకొనుటకును.

(5) ఎయిడెడ్ టీచర్సుకు కూడ ప్రభుత్వసిబ్బంది రేట్లప్రకారముగనే యుద్ధభత్యము లిప్పించ కోరుటకును.

( 6) ఎయిడెడ్ టీచర్సుయొక్క "స్కేళ్ళను" లోకలుబోర్డుటీచర్ల "స్కేల్సుమినిమము"లో సమానముగా నుండునట్లు హెచ్చించుటకును.

( 7) నెలవారీ గ్రాంట్లు యిప్పించుటకును.

( 8) అద్దెలెక్కువగా నున్నచోట్ల అద్దెగ్రాంట్లు యిప్పించుటకును.

( 9) స్వంతబడుల మరమ్మతులు వగైరా **(repair and upkeep)** నకు అగుఖర్చులను యిప్పించ కోరుటకును

(10) 3, 4, 5 రిజల్యూషను కొఱకు (శ్రీ) గవర్నరుగారికి "విజ్ఞప్తి"చేయుటకును,

(11) ది 29-8-43 వరకుగల జమాఖర్చు (ఆర్. యస్. 6-4-6 నిల్వ ఆమోదించుటకు, యేకగ్రీవముగా ఆమోదించడమైనది.

(True copy)

Sd· M· S· ప్రకాశరావు,

సెక్రటరీ.　　　　ప్రెసిడెంటు.

కొర్లపాటివారిపాలెం ― అమలాపురం తాలూకా టీచరుమేనేజర్ల జనరల్ బాడీ మీటింగు 29-8-43 తేదీ ఆదివారం పగలు 1 గంటకు మహారాజ (శ్రీ) కూచిమంచి జగన్నాథంగారి అధ్యక్షతక్రింద జరుపబడి యీదిగువ తీర్మానములు గావింపబడెను.

1. లోయరుగ్రేడు ట్రయినింగు సర్టిఫికేట్లు హయ్యరుగ్రేడు సర్టిఫికేట్లుగా మార్చినట్లే తగిన పరీక్షలు యేర్పాటుచేసి హయ్యరుగ్రేడు సర్టిఫికేట్లు శకండరీగ్రేడు సర్టిఫికేట్లుగా మార్పించగలందులకు కోరుటకును.

2. మేనేజర్ల గ్రాంటుబిల్లులు టీచర్లు కొందరు అనవసరముగా పిటిషనులుపెట్టి నిలుపుచేయించదలచినపుడు ఒక్కటీచరు పిటీషనువల్ల అన్స్కూలులోని యితరటీచర్ల జీతములుగూడ నిలిచిపోవుచున్నవి. కనుక పిటిషనుపెట్టిన టీచరు జీతంమాత్రం బిల్లునుండి మినహాయించి మిగిలిన సొమ్మునకు గల బిల్లునైనను సకాలములో పంపించే యేర్పాటు చేయించగలందులకును.

3. డియర్‌నెస్ అలవెన్సులు రు 2-0-0 ల నుండి గవర్నమెంటు సర్వెంట్సుకు యిచ్చునట్లుగా హెచ్చించుటకు ప్రభుత్వము వారిని కోరుటకును.

4. పూర్వమువలెనే బిల్డింగు గ్రాంట్లు, ఫర్నిచరు గ్రాంట్లు, అద్దెగ్రాంట్లు, ధారాళముగా శాంక్షను చేయించుటకు కోరుటకు.

5. T. P. F. చెల్లించు ఎయిడెడ్ స్కూళ్ళ టీచర్లకు అది శాంక్షను అయినతేదీ గ్రాంటు స్కేలును, Enhanced స్కేలుగ్రాంటుకున్ను, గల తేడా మీదగూడా రూపాయకు రు 0-1-6 చొ॥న చెల్లించుటకును ఏర్పాట్లు చేయించుటకు కోరుటకును.

6. ధరలు హెచ్చికంటింజెన్సీ సామానుల ఖర్చులు ఎక్కువగు చున్నందున మేనేజర్లకు అందుకొరకు వేరే 5 పెర్సంటు అదనముగా యిప్పించుటకు కోరుటకును.

7. స్థానికావసరములనుబట్టి 250-500 గ్రామజనాభా గలిగి పాఠశాలలులేని గ్రామములలో పాఠశాలలు తెరచుటకు పర్మిషనులు త్వరలో తప్పక యేర్పాటు చేయించగలందులకు కోరుటకును.

8. ఎయిడెడ్ స్కూలు టీచర్లకుగూడ స్థానికసంస్థల ఉపాధ్యాయులకు గల స్కేలు మినిమంతో సమానమగు జీతములు యిప్పించుటకు కోరుటకును-తీర్మానింపబడినవి.

కొర్లపాటివారి పాలెం }
29—8—1943 }

ఇట్లు
కొండ్రెడ్డి సూర్యప్రకాశం అసోసియేషను ప్రెసిడెంటు.

ది 7—8—1943 వ తేదీ శనివారం కాకినాడ భారతీవిద్యాలయంలో జరిగిన కాకినాడ ఎయిడెడ్ గ్రూప్‌టీచర్ల అసోసియేషనులో గావించిన తీర్మానములు.

1. మిత్రమండలివారికి ట్యూనిస్ విజయమువలెనే సర్వత్రవిజయము చేకూరగాకయని దేవుని ప్రార్థించుటకును.

2. ప్రస్తుత పరిస్థితులనుబట్టి జీవితముపూర్తిగా ఆర్థికముపై నాధారపడియున్నది. గాన ప్రతిప్రాథమిక ద్రవ్యసహాయ పాఠశాలకు నెలవారీగ్రాంటు నిప్పించుచు, మరుచటినెలాఖరులోగా ఉపాధ్యాయులకు అందునట్లుగా నేర్పాటు చేయవలసినదనియునూ.

3. పాఠశాలా నిర్వహణపు ఖర్చులవిషయమై ఉపాధ్యాయులస్కేలు గ్రాంటులో 15% తగ్గించుటకు బదులుగా ఉపాధ్యాయులను పూర్తిగ్రాంటులనిచ్చుచు, టీచింగుగ్రాంటుపై 15% అదనముగా పాఠశాల యాజమాన్యుల కిప్పించవలసినదనియునూ,

4. ఈమధ్యను గవర్నమెంటు తాబేదార్లకును, లోకలు బాడీ తాబేదార్లకును యిదివరకిచ్చె యుద్ధభత్యమే కాకుండానె 1కి 2 లు అదనముగా నిచ్చియున్నారు గాన ప్రాథమిక ద్రవ్యసహాయోపాధ్యాయులకు కూడా కనీసము ఇప్పుడిచ్చు యుద్ధభత్యమును నె 1 కి రు 2 లనుండి రు 5 ల వరకు హెచ్చింపవలసినదనియునూ,

5. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల పిల్లలకు యస్. యస్. యల్. సి. పరీక్షవరకు ప్రతి సెకండరీ పాఠశాలలలోను ఉచితవిద్య నేర్పాట్లు గావించవలసినదనియునూ.

6. కనీసము 30 ఏవరేజి అటెండెన్సుగల సంపూర్ణ పాఠశాలలో యిద్దరుపాధ్యాయులకు పూర్తి గ్రాంట్లు నిచ్చుచున్నారు. అట్లేపీడరు పాఠశాలలకుకూడా 30 ఏవరేజి అటెండెన్సుతో యిద్దరుపాధ్యాయులకు పూర్తిగ్రాంటు నిప్పించవలసినదనియును, 50 ఏవరేజి అటెండెన్సుతో 3 రుపాధ్యాయులకు పూర్తి గ్రాంటు నిప్పించవలదనియునూ.

(7) ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల గ్రాంటుస్కేలు లోయరు గ్రేడువారికి రు 9 నుండి 14 రు ల వరకును, హయ్యరు గ్రేడు వారికి రు 14 నుండి రు 20 వరకును, సెకండరీ గ్రేడు వారికి రు 18 నుండి రు 25 వరకును, డిగ్రీవారికి రు 22—2—3 నుండి రు 30 ల వరకును హెచ్చింపవలసినదనియునూ.

(8) ఏతరగతిలోనైనను పిల్లలహాజరు 35 దాటినయెడల వెంటనే సదరు తరగతి సెక్షనులుగా విభజించి మరొక టీచరును నియమించుటకును, సదరు ఉపాధ్యాయునికి ఏవరేజి అటెండెన్సునుబట్టి గ్రాంటు నిప్పించవలసినదనియును,

(9) గ్రాంటుఎసెస్సు చేయునప్పుడు ఎగ్జెంప్షను లేదనియును, సర్వీసు రిజిష్టరులేదనియును, శెలవు గ్రాంటు రాలేదనియును, మొదలగు కారణములతో ఆయాటీచర్ల గ్రాంటుతగ్గించి సదరు మొత్తమును సంవత్సరాంతమున నిచ్చుచున్నారు అట్లుగాక సదరులోపములు సవరణకాబడినవెంటనే సప్లిమెంటుగాగాని తరువాత వచ్చిన Instalment గ్రాంటుతో కలిపిగాని, యిప్పించునట్లునూ.

(10) పరీక్షాధికారుల అనుమతిలేనిదే శెక్షనులు చేయరాదనియును, ఒకతరగతిశెక్షను చేయవలసి వచ్చినప్పుడు కనీసము జరిగిపోయిన ఆరునెలల సరాసరి హాజరు వచ్చిననేగాని అనుమతి నీయకూడదనియును, నిబంధనలుగలవు. అర్థసంవత్సరపు ప్రామోషనులు జరిగినవెంటనే పైతరగతిలో నింకొకఉపాధ్యాయునకు చాలినహాజరుండినచో ఆట్టితరగతిలో పైనిబంధనలతో నిమిత్తములేకుండా ప్రధానోపాధ్యాయుడు సదరు తరగతిని శెక్షనుగా విభజించి, ఉపాధ్యాయుని నియమించుటకు, అనుమతి నీయవలసినదయును తీర్మానించడమైనది.

(11) పై తీర్మానములన్నియును ఈనెలప్రారంభవిద్య, ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్యలతోనచ్చొత్తించి తక్కిన ఉపాధ్యాయకేంద్రమును కూడా నిట్టితీర్మానమును గావించి అధికారులకు పంపించునవకాశమిత్తురని, వెంకటరామా అండ్ కోవారిని, రామా అండ్ కో., వారిని, కోరుచు తీర్మానించడమైనది.

కాకినాడ,
7—8—43.

సదాశివుని చక్రపాణి,
కార్యదర్శి.

## నర్సాపురం తాలూకా బోర్డుఎలిమెంటరీ స్కూలు టీచర్సు యూనియన్

ఈ యూనియన్ కార్యనిర్వాహకవర్గ సభ్యులు ది 29-8-43 మధ్యాహ్నము నర్సాపురములోని పెలరుపేట బోరు బాలురపాఠశాలలో శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజుగారి అధ్యక్షతను సమావేశమై శ్రీ పశ్చిమగోదావరిజిల్లాబోర్డు ప్రసిడెంటువారిని రేంజి పరీక్షాధికారులను ఆహ్వానించిరి. ఇతర విషయము

లను సెంటరుకొనులలో మాట్లాడకూడదను L. Dis 125 Gl of 43 dated 4-7-43 గల సభ్యులకు, శ్రీ డిప్యూటీ ఇన్‌స్పెక్టరువారిచే జారీచేయబడినందున కేంద్రసంఘ సమావేశములలో యూనియను విషయములుకూడా ముచ్చటించుటకు ఆటంకముకలిగిన విషయమునుగూర్చి తీవ్రముగా చర్చించి, సదరు సభ్యులరు ఉపాధ్యాయవృత్తి గౌరవము నకును, యూనియనుల అభివృద్ధికిని, భంగకరముగాన కేంద్రసంఘసమావేశ కార్యక్రమములో (Central classes) యూనియను విషయములకొరకు అవకాశము ఇప్పించవలనదిగా శ్రీ డిప్యూటీయినస్పెక్టరువారిని వాగూ్రపముగాను, తీర్మానరూపముగాను కోరగా శ్రీవారు తప్పక సదరు తీర్మానమును గౌరవించుటకు అంగీకారమును వెలిబుచ్చిరి. మరియు రాయలసీమ క్షామనివారణనిధికి యూనియన్ ఫండ్సునుంచి రు 5 లు విరాళము యిచ్చుట, తాలూకాలోని ఉపాధ్యాయులకు అధమము ఒక్కొక్కరికి 3 శేర్లు చొప్పున కిరోసిన్ యిప్పించవలసినదిగా శ్రీ కలెక్టరువారిని కోరుట, 1942-43 సం॥ యూనియన్ ఆడిట్ రిపోర్టు చదివి అంగీకరించుట, రాబోవుమహాజనసభకు 5 గురు సభ్యులు గల కమిటీని నేర్పాటుచేయుట మొదలగు తీర్మానములు గావింపబడెను. ఎతత్సభకు సుమారు 50 మంది ఉపాధ్యాయులు హాజరైరి. శ్రీజిల్లాబోర్డు ప్రెశిడెంటువారు, పరీక్షాధికారులును, సభకువిచ్చేసి సభ్యులకు మహదానందము కలుగజేసిరి. సభ్యులందరకు అల్పాహారము లొసంగబడెను.

నర్సాపురం
30—8—43

శిష్టా సూర్యనారాయణ
కార్యదర్శి

# కడప జిల్లా

రాయచోటి తాలూకా చిన్నమండెం సెంటరు ఉపాధ్యాయ సంఘసభ్యులు 21-8-43 తేదీ సమావేశమై గావించిన తీర్మానము.

మాకు బొత్తిగా తిండికి ఆహారపదార్థములు చిక్కక మిక్కిలి అవస్థపడుచున్నాము. కంట్రోలు అధికార్లను అడిగితే యెంతమాత్రము దయచూపలేదు. వారమునకు ఒక రూపాయి బియ్యము యెంతో విన్నవించుకొనగా చిక్కడములేదు. మేము మా కుటుంబీకులు పస్తుపడి బాలురకు విద్యగఱపుట యెంత కష్టమో చెప్ప సాధ్యము గాకున్నది. మేము ఎవరితో చెప్పుకొన్నను మాకు తగుమాత్రము ఆహారపదార్థములు చిక్కునట్లు చేయువారు లేరు. మా జీతములా స్వల్పము. అవియు సకాలమునకు అందక అవస్థపడుచున్నాము. ఇతర డిపార్టుమెంటు ఉద్యోగస్థులు అనగా పోలీసు మొదలైనవారికి సకాలజీతములు. సరియైన అలవెన్సులు అన్నియు ఉన్నవి. వారితోబాటు మేముకూడ వేరు గ్రామమునుండి వచ్చి కాపురము చేయుచున్నవారమే. మావిషయమై విచారించువారు లేకున్నారు.

కాబట్టి మాబీదవారి మొర ఆలకించి మాసెంటరు హెడ్‌క్వార్టరునందు ఉపాధ్యాయులకుగాను మొత్తముగా నెలకు కొన్ని మూటల బియ్యము మాఖర్చులకు తగినట్లు యివ్వ యేర్పాటు చేయవలెనని ప్రభుత్వము వారిని కోరుచున్నాము.

T. A. Centre, Chinamandem. P. Subbanna, Secretary.

# సారస్వత సభ

నరసరావు పేట యు. యల్. సి. యమ్. బాలికా ప్రాథమికోన్నత పాఠశాలా ఉన్నత షష్ఠమ వాగ్వర్ధనీ సారస్వత సమావేశము సదరు పాఠశాలా ప్రధాన సహాయోపాధ్యాయులును, ప్రణాళికేతర పాఠసంఘ నిర్మాణకులును, నగు శ్రీయుత బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య గారి యాజమాన్యమున జయప్రదముగ జరిగినది. అధ్యక్షులు "అహింస" అను శీర్షికపై గంభీరోపన్యాసము నిచ్చిరి. అధ్యక్షునికి వందన శత సమర్పణముతో సమావేశము జయప్రదముగ విరమింపబడెను.

జె. మరియమ్మ, 8 వ తరగతి,
కార్యదర్శి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A., L.T., గారిచే

2 - 3 - 4 - 5 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.